Issued on 8-9-1955





LIBRARY
20 DEC 1955
ANDHRA LEGISLAT...

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

## (CAMP) WALTAIR

## OFFICIAL REPORT

**TUESDAY, THE 1ST JUNE 1954.**

**VOLUME IX—NO. 6**

*CONTENTS*



PRINTED AT
SREE RAMA PRESS,
*MADRAS—21.*

FOR THE SUPERINTENDENT, ANDHRA GOVERNMENT PRESS,
KURNOOL.

1955

PRICE: 6 *annas*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**TUESDAY, the 1st June 1954.**

The House met in the T. L. N. Hall, Andhra University Campus, Waltair, at nine of the clock, with Mr. Deputy Speaker, (Sri Pasala Suryachandra Rao) in the Chair.

## QUESTIONS AND ANSWERS

### Starred Questions

Deputy Speaker .—

* 701 Q .— It will be taken afterwards.

* 702 Q — Sri Rajeswara Rao is not in his place; the question shall be deemed to have been withdrawn.

* 703 Q — Sri Koti Reddi is absent · so postponed.

* 704 Q ·— Sri K. Subba Reddi is absent; so the question shall be deemed to have been withdrawn.

705 Q ·— Sri Vavilala Gopalakrishnaiah is absent; the question shall be deemed to have been withdrawn.

### THUNGABHADRA HYDRO ELECTRIC PROJECT

* 708 Q — Sri P. Ranga Reddi M.L.A. :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state.

*(a)* whether the Planning Commission of the Government of India has sanctioned the Tungabhadra Hydro Electric Project;

*(b)* the expenditure that will be involved for the completion of this project and in how many stages this project will be completed;

*(c)* how many Kilo-watts of Electricity be generated by will this project, and

*(d)* the areas that will be served by this project in the Andhra State ?

The Hon. Sri N. Sanjeeva Reddi :—

*(a)* Yes.

*(b)* The expenditure required for the completion of the Project is Rs 661 lakhs. The project will be completed in 3 stages.

(c) 27,000 K. Ws of power initially and 63,000 K. Ws. ultimately of which 32,000 K. Ws. will be firm power.

(d) Kurnool, Cuddappah and Anantapur Districts.

G Sivasankara Reddi — తుంగభద్ర Hydro Electric Schemeలో రెండు main stations, 22 sub-stations, transmission line లు వేయవలెనని ఉంది. ఇందులో ఎంత complete అయింది? కడపలో ఎన్ని ఏర్పాట్లుచేస్తున్నారు.

The Hon. Sri N. Sanjeeva Reddi — Separate question వేస్తే చెప్తాను.

Sri B Krishnamurthy Rao.— అధ్యక్షా, ఉమ్మడిరాష్ట్రంలో ఉన్నపుడు చిత్తూరుజిల్లాకు మెట్టూరునుండి విద్యుచ్ఛక్తి సరఫరాచేయుడానికి ఏర్పాట్లుజరిగినవి. ఇప్పుడు తుంగభద్రనుండి సప్లయిచేయకుండా ఉన్నారు. తుంగభద్రనుండి చిత్తూరు జిల్లాకు సప్లయి చేయడానికి ప్రభుత్వం పూనుకొంటుందా?

The Hon Sri N. Sanjeeva Reddi — చిత్తూరుకు మెట్టూరునుంచే వస్తుంది. ఇంకా ఎక్కువగ తీసుకొనుటకు ప్రయత్నం చేస్తున్నాను. తుంగభద్ర develop అయినతరువాత కోడూరుమీదుగా తీసుకొంటాము.

Sri T. Lakshminarayana Reddi — ఈప్రాజెక్టు, రాయలసీమప్రాంతానికి చాలాముఖ్యమైనది. 1955 వ సంవత్సరంలోపుగానే, దీనిని పూర్తిచేయడానికి ప్రభుత్వమునకు ఏమి యిబ్బందులు వున్నవి? ఈ యిబ్బందులన్నిటిని తొలగించి త్వరలో పూర్తి చేయడానికి ప్రభుత్వం ప్రయత్నంచేస్తుందా?

The Hon Sri N. Sanjeeva Reddi — 1957 వ సంవత్సరానికి పూర్తి అవుతుందని చెప్పుతున్నాను. అప్పటికికూడ, ఏమైన యిబ్బందులువుంటే, వాటిని అతిక్రమించి పూర్తిచేయదలచుకున్నాము.

Sri S. Narayanappa ;— తుంగభద్రా హైడ్రో ఎలక్ట్రిక్ పవరు మనకు వచ్చినతరువాత, Jog power వాడకం continue చేస్తారా? లేక రద్దుచేసుకుంటారా?

The Hon. Sri N. Sanjeeva Reddi — తుంగభద్ర హైడ్రో ఎలక్ట్రిక్ పవరు యింకారాలేదు. అది వచ్చినతరువాత చూసుకోవచ్చును. లేకపోతే, యీలోపునే ఆపివేస్తారు. 1957 వ సంవత్సరంతరువాత దీనినిగురించి ఆలోచిస్తాము.

## VILLAGE OFFICERS IN PROPRIETARY AND RYOTWARI VILLAGES

* 709 Q:— Sri K. Krishna Rao :— Will the Hon. the Minister for Land Revenue be pleased to state:

(a) whether there is any proposal to revise the scales of salary and allowance payable to Village Officers in proprietary

June 1954]

villages and also in villages which are resumed by Government under the Zamindari Abolition Act to bring it on par with those paid to village Officers in Ryotwari areas, and

(b) whether the system of paying commission to the village officers is still continuing, and if so, whether the rates are enhanced and if they are, what the rates of commission paid now prevailing are?

The Hon. Sri K. Koti Reddi :—

(a) There is no proposal now under the consideration of Government to revise the scales of pay and allowances of village officers in the Proprietary Estates. The question whether the salaries of the Village Officers in the Estates taken over by the Government under the Estates Abolition Act, should be refixed at the rates paid to the bulk of the Village Officers in the Ryotwari areas is now under the consideration of Government.

(b) The answer is in the affirmative. The Village Officers in the Estates taken over by the Government are paid commission for the collections made by them under Estates Land (Reduction of Rent) Act, 1947. (Madras Act xxx of 1947) and section 55 (1) of the Madras Estates (Abolition and conversion into Ryotwari) Act, 1948 (Madras Act xxvi of 1948). Upto 1951, the total commission payable to Village Officers and servants was 4 percent calculated on the actual collections made by the Village headman. In 1951, the total commission payable to Village Officers and servants was raised to 5 per cent. Out of this 5 per cent commission, the headman is paid 2 per cent, the karnam is paid 2 per cent generally and the village servants are paid 1 per cent (to be shared by both the talayaris and vettis.)

Sri K. Krishna Rao :— ఇంతకుముందు కొన్ని కొన్నిగ్రామాలలో కమీషన్ యిస్తూ జీతాలు లేకుండా వెట్టిచాకిరి చేయించుకుంటున్నారు.

The Hon. Sri K. Koti Reddi :— జీతాలు యివ్వడంలేదనే మా information. కాని వాళ్లు collection చేసేటంతవరకే వారికి కమిషన్ యిస్తున్నారు.

Sri K. Krishna Rao — "పర్మనెంట్" ప్రకారం యిస్తున్నారా?

The Hon. K. Kotti Reddi — వారికి 'కమీషన్' మాత్రమే ఇవ్వబడుతున్నది. ఇది "చాలునా, చాలదా" అనేది ఆలోచిస్తాం.

Sri R. Lakshminarasimham Dora — Is there a proposal to reduce the number of village groups on the ground that some of them are not viable?

The Hon Sri K. Koti Reddi — ఈ తీసుకున్నటువంటి "ఎస్టేట్ల"లోని విలేజి ఆఫీసర్ల విలేజి సర్వెంట్లయొక్క జీతాలను హెచ్చు చేయటం అవసరమే. కాని దీనికి మామూలురైత్వారిగ్రామాలలోని ఆఫీసర్లకు, సర్వెంట్లకు చాలా భేదంవుంది. రివిన్యూకలెక్షన్ లోనే చాలా భేదంవుంది. అయినప్పటికీ, వీరి జీతాలను హెచ్చుచేయవలసిన అవసరంవుంటే ఆలోచిస్తాం.

Sri Pillalamarri Venkateswarlu — ఇప్పుడు వీళ్లచేత వెట్టిచాకిరి చేయించుకొని ఎస్టేట్ విలేజిఆఫీసర్లకు జీతాలులేకుండా కమీషనుమాత్రం యివ్వడం సరియైన పద్ధతిగాదని ప్రభుత్వం భావిస్తుందా? వారికిగూడ జీతాలు fix చేయగూడదా? ఇందుకు వచ్చిన అభ్యంతరం ఏమిటి?

The Hon. Sri K. Koti Reddi — అభ్యంతరం ఏమీలేదు. ఎస్టేటు గ్రామాలు చాలాచిన్నవి. వాటిమీద వచ్చేరివిన్యూ చాలాతక్కువ. అక్కడివాళ్లకు జీతాలు ఏర్పాటుచేస్తే, collection అయిన land revenue అంతా వారిజీతాలకే సరిపోతుంది. ఆ గ్రామాలమీద రు 800 లో, రు. 900 లో land revenue వస్తున్నది ఇంత తక్కువ రివిన్యూవచ్చేచోట జీతాలు ఏర్పాటుచేస్తే, అక్కడి ఉద్యోగస్తులకే సరిపోవచ్చును. అంతకంటె ప్రత్యేకమైనటువంటి అభ్యంతరం ఏమీలేదు.

Sri R. Venkatajagga Rao — కమీషన్‌పద్ధతిగాకుండా, వీరికి జీతాలు హెచ్చుచేయాలనేవిషయంలో, ప్రభుత్వం ఆలోచిస్తున్నదని చెబుతున్నారు. ఇప్పటి కప్పుడే జమీందారీల abolition అయి కొన్నిసంవత్సరాలు అయినప్పటికీ ఆలోచిస్తూనే వున్నారు. వీళ్లు బ్రతికివుండగానైనా హెచ్చుజీతాలు యివ్వడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా?

The Hon. Sri K. Koti Reddi :— దీనినిగురించి, త్వరలో ఫైసలు అయేటట్లు చూస్తాం.

Sri Pillalamarri Venkateswarlu — Zamindari Abolition Act 1947 లో pass అయింది. ఈ villages ను group చేసే కార్యక్రమం, ఇంతవరకు ఏమీలేదు. ఇంకా 15 సంవత్సరాలు పడుతుందా? ఇట్లా ఎంతకాలం అట్టే

1st June 1954]

పెట్టుతారు? క్రైత్వారీప్రాంతాల్లోవున్నట్టే జీతాలు fix చేసి, వెంటనే group చేయటానికి ప్రభుత్వం పూనుకుంటుందా?

The Hon. Sri K. Koti Reddi — ఎనిమిది, పది సంవత్సరాలు ఏమీ జరుగకుగాని, ఒకసంవత్సరంలోపుగానే పూర్తిచేయటానికి ప్రయత్నిస్తాం.

Sri K. Venkiah — కొన్ని గ్రామాలలో వెట్టీలకు జీతాలు లేకుండా వున్నారు అలాంటివారివిషయంలో ప్రత్యేకమైనశ్రద్ధతీసుకొని అక్కడి గ్రామమునసబులకు గూడ జీతాలు యిప్పించడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా?

The Hon Sri K Koti Reddi — వారికి జీతాలు హెచ్చుచేయటమనేది కారణంగాదు వాళ్లకు వెనక కొంతఆస్థి వుండవచ్చును. దానిపై వాళ్లు ఆధారపడివుంటారు జీతాలు తక్కువగావున్నప్పటికి, వాళ్లు భుక్తిజరుపుకునేదానికిగాను, హెచ్చుజీతాలు వుండవలసినదే. వీటినిగురించి ఒకసంవత్సరంలో ఆలోచిస్తాము.

## ASSIGNMENT OF LANDS TO POLITICAL SUFFERERS IN BHIMAVARAM AND NARSAPUR TALUKS

* 703 Q — Sri P. Syamasundara Rao.— Will the Hon. the Minister for Land Revenue be pleased to state.

(a) the number of political sufferers in Bhimavaram and Narsapur taluks (West Godavari District),

(b) how many of them have received lands;

(c) the extent of land assigned to various parties;

(d) whether any of these lands have been under others before assingnment; and

(e) if so, where and how much?

The Hon. Sri K. Koti Reddi :—

(a) The No. of political sufferers in Bhimavaram Taluk is 247 and that in Narasapur taluk is 98.

(b) 46 political sufferers in Bhimavaram taluk and 34 in Narasapur taluk were assigned lands.

(c) A total extent of Ac. 189·77 was assigned to the 46 political sufferers in Bimavaram taluk and an extent of Ac. 140·78 was assigned to the 34 political sufferers in Narsapur taluk.

[1st June 1954

*(d)* The answer is in the negative.

*(e)* Does not arise.

Sri P. Syamasundara Rao — రాజకీయబాధితులకి భూములుయిచ్చిన వారిలో కొంతమంది Justice party ఆతరువాత కాంగ్రెసుపార్టీలో వున్నారు. అటువంటి వారు రాజకీయబాధితులుగా సర్టిఫికెట్ పొందారు. వీళ్లకొరకు, అంతవరకు సాగుచేసుకొనుచున్నవారి భూములను ఊడ లాక్కోడం జరిగింది. వీనినిగురించి Assembly లో కూడ చెప్పారు. కాబట్టి ప్రభుత్వం దీనివిషయమై పరిశీలిస్తుందా ?

The Hon. Sri K. Koti Reddi — అటువంటివి నా నోటీసుకు తీసుకొని వస్తే పరిశీలిస్తాను.

Sri P. Syamasundara Rao — గుద్దంటి నరసింహమూర్తి అనే ఆయన ప్రముఖవర్తకులు, భూస్వాములు ఆయన కాంగ్రెసులో ఎప్పుడూ వుండలేదు. Justice party లో వుండేవాడు. ఆయనగారికి ఉప్పర్లు చేసుకునేటటువంటి 4 యకరాలభూమిని శ్మశానం ప్రక్కనున్న దిబ్బను, యింకా మరికొంతభూమిని రాజకీయబాధితుడి పేరట యిచ్చారు. అట్లాగే మట్టపర్రు అనే గ్రామంలో ఒక హరిజనుడు సాగుచేసుకొనుచున్న భూమిని లాక్కొని రాజకీయబాధితులకు యిచ్చారు. ఇటువంటి వాటి విషయంలో ప్రభుత్వం ఆలోచించి తగుచర్య తీసుకుంటుందా ?

The Hon. Sri K Koti Reddi — జస్టిస్ పార్టీలోవుండి కాంగ్రెసులో జేరినవారూ వున్నారు. కాంగ్రెసులోవున్నవారు - కమ్యూనిస్టుపార్టీలో జేరినవారూ వున్నారు.

Sri B Krishnamurthi Rao — అధ్యక్షా ! ఏడుసంవత్సరములనుండి ఈ రాజకీయబాధితులకు భూములిచ్చేటటువంటి సమస్య అటు చావకుండా, ఇటు బ్రతుకకుండా ప్రభుత్వము పెట్టడంవల్ల, అటు ప్రతిపక్షానికి, ఇటు రాజకీయబాధితులకు చాలాకష్టముగా ఉంటున్నది. కనుక తొందరగా దీనిని ఏదోవిధంగా ఇస్తామనో, ఇవ్వమనో చెప్పితే బాగుంటుంది, దీనిని వెంటనే పరిష్కారంచేస్తారా ?

The Hon. Sri K. Koti Reddi — ఏదో ఒకటి చేస్తాము త్వరగానే.

Sri M. Hanumantha Rao :— ఈ విషయంలో ఇప్పటికే చాలా ఆందోళన జరిగింది. ఇది చాలా తగాదాలకు కారణమైంది. ఈ political sufferers కు భూములివ్వడమనే policy ని give up చేసి మరోకవిధానాన్ని పెడతారా ?

The Hon. Sri K. Koti Reddi .— తగాదాల సంగతి నాకు తెలియదు. కాని ఇప్పుడు వచ్చినటువంటి ప్రశ్నలవల్ల తెలుస్తున్నది. కొంతవరకు undeserving people కు ఇచ్చారని అంటున్నారు. ఆవిధంగా చెప్పడం సబబుకాదు. ఈ విధానం పొత్తిగా give up చేయుటకు వీలుపడదు. కాని ఈ విషయంలో సాధ్యమైనంత వరకు న్యాయం జరిగేటట్లు ప్రయత్నంచేస్తాము.

1st June 1954]

Sri P Venkatasubbaiah — రాజకీయ బాధితులు కావడం, స్వరాజ్యం సంపాదించడానికేగాని, భూములుసంపాదించడానికి కాదనే ఉద్దేశ్యం మనస్సులోఉంచుకొని ప్రభుత్వము, మంత్రిగారు ఇకముందైనా రాజకీయబాధితులకు భూములివ్వకూడదనే నిశ్చయంచేసుకొంటారా ?

The Hon. Sri K Koti Reddi — సామాన్యంగా భూములు లేనటువంటి రాజకీయబాధితులకు భూములివ్వాలని చెప్పవలసిన అవసరమే ఉండదు. అయితే, general గా రాజకీయబాధితులకు భూములిచ్చారంటే ఏదో special consideration వల్ల ఇచ్చినారు. ఎవరివిషయములోనైన special consideration ఇప్పుడుకూడఉంటే, అటువంటి వారికి ఇస్తాము.

Sri Pillamarri Venkateswarlu — అధ్యక్షా' రాజకీయబాధితులని చెప్పి 50 ఎకరాలు, నూరు ఎకరాలు ఉన్నటువంటివాళ్లకు జైలుకు పోయినారనో లేక జైలులో ఉండేవాళ్లకు మంచినీళ్లు ఇచ్చారనో, కాని, బేడాసహాయంచేశారనో, వారికి ఇతర భూములు లేనటువంటి బీదప్రజా నీకంతోపాటు ఇచ్చియుంటినట్లయితే వాటిని రద్దుచేయడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

The Hon. Sri K Koti Reddi — దేశంకొరకు సహాయంచేసినటువంటి వారికి హిందూరాజులు మహమ్మదీయరాజులు ఇనాములనిచెప్పి వారి జ్ఞాపకార్థమో లేక పోషణార్థమో ఇదివరకు ఎన్నోసంవత్సరములనుంచి ఇవ్వడం జరుగుతున్నది. కనుక ఈ political sufferers కూడ దేశస్వాతంత్ర్యంకొరకు సహాయంచేసినందువల్ల ఏదోఒక గుర్తుగా కొద్దిగా భూమి ఇవ్వడం జరిగింది. వారికి వేలకొలది ఎకరాలభూములేమి ఇవ్వలేదు. అయిదు, పది ఎకరాలు ఇచ్చారు ఇదేమి అంత గొప్పదికాదు. అదీకూడ హెచ్చుగా భూములుండేవాళ్లనుగూడ తీసుకొమ్మని బలవంతంచేయలేదు. ఎవరైనాకోరితేనే ఇచ్చాము. వారితోపాటు ఇతర landless poor కు కూడ ఇస్తున్నాము కదా ?

Sri M Veerabhadram — ఈ రాజకీయబాధితుల విషయంలో, చాలా మంది undeserving వారికి భూములిచ్చారని, ఇదివరకు ఆక్రమించుకొన్నవారినుండి భూములు లాగుకొని రాజకీయబాధితులకు ఇచ్చినారని పలువురు సభ్యులు చూపిస్తున్నారు. ఇప్పుడు బంజరుభూముల పంపకానికి ప్రభుత్వం పూనుకొంటున్నదని తెలిసింది. దానితోపాటు ఈ రాజకీయబాధితులకిచ్చిన భూములవిషయంకూడ పునరాలోచిస్తారా ?

The Hon. Sri K. Koti Reddi — అదికూడ ఆలోచిస్తాము.

Sri M. Kune Rao — ఈ రాజకీయబాధితులలో ఒకరైన, మన శాసన సభలోని దంతులూరి నారాయణరాజుగారికి 4 సంవత్సరముల క్రిందట దాదాపు 15 సంవత్సరములనుంచి సాగుచేసుకొంటున్న హరిజనులనుంచి భూమినితీసుకొని, ఇవ్వడం జరిగితే దానిని రాజగోపాలాచారిగారిప్రభుత్వము తాత్కాలికంగా నిలుపుదలచేసింది. కాని

ఈ ప్రభుత్వం దానిని మరల ఆయనకు ఇవ్వ దలచారని తెలుస్తున్నది ఇది చాలా అన్యాయము. కనుక దీనిని ఆపివేయడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా.

The Hon Sri K Koti Reddi — అన్యాయమా, న్యాయమా అని ఎట్లా చెప్పగలను. గవర్నమెంటు స్వాధీనంలో ఉండే భూమినే రాజకీయ బాధితులకు ఇచ్చాము. ఎవరైనా అటువంటి భూమిని unauthorisedగా ఆక్రమించుకొనియుంటే, అటువంటివారిని తొలగించాము. అటువంటి కేసులు ఉండవచ్చు. అయినప్పటికిని, ఇకముందు జరుగబోయే వాటిని జాగ్రత్తగా పరిశీలిస్తాము, మీరు చెప్పిన విషయాలన్నీ కూడ గమనిస్తాము.

Sri N. Sivasankara Reddi — ఈ రాజకీయ బాధితులకు ఇచ్చినటువంటి భూములను వారే స్వంతముగా చేయవలెననేటటువంటి నిబంధన ప్రభుత్వము పెడుతున్నారా?

The Hon Sri K. Koti Reddi — అవును. స్వంతంగా సేద్యముచేయవలెనంటే పనివాళ్లుంటారు వాళ్లతో స్వయముగా చేయించడమన్న మాట.

## INCLUSION OF GOKAVARAM FIRKA IN FIRKA DEVELOPMENT SCHEME

* 710 Q. Sri Y. V. Krishna Rao :— Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state:

*(a)* whether there is any representation to include Gokavaram firka in Rajahmundry Taluk in firka Development Scheme, and

*(c)* If so, the action taken thereon?

The Hon. Sri D. Sanjeevayya —

*(a) & (b)* Yes. A representation from the villagers of Rampayerrempalem and Gokavaram firka in Rajahmundry Taluq was received by the Government. Gokavaram is one of the areas included in the National Extension Service Blocks selected for introduction.

(a) అవును.

(b) ఈ గోకవరము అనేటటువంటిదాన్ని National Extension Scheme క్రింద చేర్చినాము.

Sri Y. V. Krishna Rao — దీని క్రింద ఏమైనా కార్యక్రమం ప్రారంభించారా? ప్రారంభించియుంటే, ఆ కార్యక్రమాన్ని చెప్పుతారా?

The Hon. Sri D. Sanjivayya :— ఏప్రెల్ 4 వ తేదీన ఈ పనులకు ప్రారంభోత్సవం జరిగింది. ఏయేపనులు జరుగుతున్నాయని ఆకార్యక్రమందొక్క వివరాలు కావలసివస్తే ప్రత్యేకప్రశ్న వేస్తే చెప్పగలను.

1st June 1954]

Sri T Lakshminarayana Reddi — ఈ firka development scheme లో స్థళాలను చేర్చేవిషయములో జిల్లా Planning Board వారి సలహాల ప్రకారం చేస్తున్నారా, లేక వారికి కావలసినవాటిని చేరుస్తున్నారా.

The Hon. Sri D. Sanjivayya — వారి సలహాల ప్రకారమే చేర్చడం లేదు. కాని వారి సలహాలుకూడ తీసుకొంటాము.

Sri S. Narayanappa — ఈ Development Scheme క్రింద చేర్చే firkas, ఏమే అర్హతలు కలిగియుండాలో సెలవిస్తారా ?

The Hon Sri D. Sanjivayya — 'వీటి అర్హతలనుగురించి అనేకపర్యాయములు ఈ శాసనసభలో చెప్పినట్లు జ్ఞాపకమున్నది. మరీమరీ చెప్పడం భావ్యంకాదను కొంటాను,

Sri M. Kune Rao — అధ్యక్షా, పూర్వము Development firkas గా ఉన్నప్పుడు, ఆయా ఊర్లలోనివారు సహాసభ్యులుగా ఒక కమిటీ ఉండేది. National Extension Scheme ఏర్పరచినప్పుడు, దాన్ని రద్దుచేశారు కాని ఈ scheme గురించి సలహా ఇచ్చేదానికోసం ఆ కమిటీలను మరల ఏర్పాటుచేసే ఉద్దేశ్యము ప్రభుత్వానికి ఉన్నదా ?

The Hon. Sri D. Sanjivayya — ఉన్నది.

Sri T. Vemaiah — అధ్యక్షా, ఈ Firka Development Scheme ను లోగడ ఒక పెద్ద white elephant అని అనుకొనేవారు అందరు. కనుక ఈ scheme లేకుండాచేస్తారా.

The Hon Sri D. Sanjivayya — ఆవిధంగా ఎవరు అనుకొనేవారండీ !

Sri S. Vemaiah.— ఇది ఒక big white elephant అని అందరికి తెలుసును.

The Hon. Sri D Sanjivayya — నా అభిప్రాయం అదికాదు. ఇది ప్రజలకు చాలా లాభదాయకముగా, ఉపయోగకరంగా ఉన్నదనే అనుకొంటాను.

Sri C. V. K Rao —అధ్యక్షా! ఈ Firka Development Scheme తరువాత Community project బయలుదేరింది. ఆ Community project తరువాత National Extension Scheme అనేది బయలుదేరింది. ఇటువంటి paper schemes అన్నీ ఒకదానితరువాత ఒకటి ప్రారంభించి ప్రజలను మోసగించేవిధానాన్ని ప్రభుత్వము తలపెట్టిందా. అసలు ఈ schemes క్రింద ఏమైనా పనులు జరుగుతున్నాయా !

The Hon Sri D. Sanjivayya — ఇవి కేవలం పేపరుమీద ఉండే ప్రణాళికలు కావని చెప్పుచున్నాను అనేకచోట్ల పనులు జరుగుచున్నాయి వారి నివాసపట్టణము పరిసరప్రాంతాలలోను ఈ Community project పనులు జరుగుచున్నాయి. అదికూడ తెలుసుకోకుండా, కళ్లుమూసుకొని ఇక్కడ ప్రశ్నవేస్తున్నారంటే చాలా ఆశ్చర్యకరంగా ఉన్నది.

Sri C V. K. Rao —On a point of order, Sir,

మంత్రిగారు కాకినాడపట్టణము అందులో చేరిందని చెప్పారు. కాకినాడ అందులో లేదని తెలుస్తున్నది.

The Hon Sri D. Sanjivayya — నేను 'పరిసరప్రాంతములోవున్నది' అని చెప్పాను. అది గౌరవసభ్యుడు కృష్ణారావుగారు గుర్తించినట్లులేదు.

Sri G Rama Rao — ఇంతవరకు యీ Firka Development Scheme క్రింద District Rural Welfare Committees వున్నవి. ఈ National Extension Scheme వచ్చినతరువాత యీ కమిటీలు రద్దుచేసి ఏవో District Planning Development Committeesను ఏర్పాటుచేస్తామని అన్నారు. అటువంటివి ఏమైనా ఏర్పాటుచేశారా ?

The Hon Sri D Sanjivayya — ఈ Firka Development Scheme క్రింద కొన్ని Planning Development Committeesను కొద్దిరోజుల క్రితమే ఏర్పాటుచేయటానికి ప్రభుత్వము నిర్ణయించుకుంది. ఏ ఏ blocksలో ఏఏ అభివృద్ధిస్కీములు ఏర్పాటుచేయవలసిందిన్నీ పరిశీలిస్తున్నాము.

Sri R Siddanna Gowd — ఈ Firka Development Scheme క్రిందగాని, National Extension Scheme క్రిందగాని, ఎంతడబ్బు ఖర్చు చేస్తున్నారు ?

The Hon. Sri D. Sanjivayya — ఎంత డబ్బు ఖర్చుచేస్తున్నారు అని అడిగితే, దానికి యిప్పుడు నేను సమాధానముచెప్పలేను. Files వచ్చినతరువాత, యీ ప్రశ్నకు సంబంధించిన figures మీముందు పెట్టుతాను. వాటిని ఆధారంగా తీసుకొని ఎంత percentage work out అవుతుందో మీరే చూచుకోవచ్చు.

Sri R. V. Jagga Rao :— On a point of order, Sir.

760 నెంబరుగల ప్రశ్నకుసంబంధించిన సమాధానము కావలసియున్నది. ఆ ప్రశ్న నావద్దవున్నది. అది చాలా ముఖ్యమయింది గనుక, దానికి యింకా కొంచెము టైముకావాలని అడుగుతున్నాను.

Deputy Speaker :— ఆ ప్రశ్న నావద్దకూడావున్నది.

1st June 1954]

## ROAD BRIDGE OF GUNDLAKAMMA RIVER NEAR ADDANKI

* 712 Q — Sri M. Bapaiah Choudary .— Will the Hon the Deputy Chief Minister be pleased to state

*(a)* whether any representation was received by the Government from the villagers of Addanki in Guntur District for repairing the road bridge of Gundlakamma river near Addanki, and

*(b)* if so, the action taken thereon?

The Hon. Sri N. Sanjeeva Reddi —

*(a)* The answer is in the affirmative.

*(b)* The matter is under consideration.

Sri M. Bapaiah Chowdary — అద్దంకి గ్రామానికి ప్రక్కననే నది వున్నది. ఆ నదికి ప్రక్కనే భూములుకూడవున్నవి. ఆ నది రాకపోకలకు చాలా అసౌకర్యంగా వుంటున్నది. వ్యాపారస్థులకు ఎక్కువగా యిబ్బందితగులుచున్నది. ప్రతితడవయునూ యీ నదిలో నీళ్లువుండడమువల్ల దాటిరావలసివస్తున్నది. ఒక్కొక్కప్పుడు ప్రాణనష్టము కూడా జరుగుతున్నది. అందువల్ల ఆ నదికి ఏదైనా ఒకవంతెన ఏర్పాటుచేస్తారా?

The Hon. Sri N Sanjeeva Reddi :— ఈ విషయములో ఇంజనీయరు గారివద్దనుంచి final report రాలేదు. అందువల్ల నేను యీ ప్రశ్నకు ఒక సందిగ్ధమైన జవాబుయివ్వవలసిన అవసరమువచ్చింది. Final report వచ్చినతరువాత, తగిన ఏర్పాటు చేయటానికి ప్రయత్నిస్తాము.

Sri K. Malakondaiah — క్రిందటిసారి సంజీవరెడ్డిగారు, నారాయణ స్వామిగారు వారందరు వచ్చినప్పుడు తిమ్మాయపాలెము వెళ్లవలసివచ్చినప్పుడు ఈ నది దాటవలసివచ్చిన సంగతి మంత్రిగారికి, అందరికి తెలుసు. అక్కడ వంతెనకట్టడము చాలా అవసరమని కొన్ని అర్జీలు, మెమోరాండాలుగూడా యిచ్చాము. ఈ యిబ్బంది మంత్రిగారు కూడా స్వయముగా చూచారు కాబట్టి, యిక్కడ యిబ్బందులులేకుండా వెంటనే చర్య తీసుకోటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా?

The Hon. Sri N. Sanjeeva Reddi .—మాలకొండయ్యగారు యీ ప్రశ్నే చాలా ప్రమాదపరిస్థితులలో వున్నట్లుగా అడిగారు అనుకుంటున్నాను. అప్పుడైతే వారిపెళ్లి కాలేదు. కాబట్టి అప్పుడు ఆ నది దాటేటప్పుడు చాలా కష్టపడివుంటారు అనుకుంటాను. కాని యిప్పుడు వారు అడగరు అనుకుంటాను. ఇంజనీరు రిపోర్టు యింకా రాలేదు. అది వచ్చినతరువాత దానిసంగతి విచారిస్తాను. దానికి సంబంధించిన files కర్నూలునుంచి యీ రోజున రాలేదు. అవి ఎక్కడో miss అయినట్లుగా కనబడుతున్నవి. అవి రాగానే-

మీకు దానికికావలసిన information అంతా చెబుతాను. ఇంతవరకు నాకువున్న memory ని బట్టి చెబుతున్నాను. కాని వివరాలు నావద్ద లేనప్పుడు నన్ను ప్రశ్నలువేస్తే నేను వివరాలు లేకుండా ఎట్లా చెప్పగలను. నేను files లేకుండా commit చేసుకో దలచలేదు.

Sri Vavilala Gopalakrishnaiah — అధ్యక్షా! పెళ్లి అయినవారందరు life risk చేయవలసిన అవసరముండదు అని మంత్రిగారు చెబుతున్నారు. అట్లాంటప్పుడు పెళ్లికానివారంతా మరి life risk చేయవలసిందేనన్నమాటా?

No answer.

Sri S. Vemaiah — మంత్రిగారు రిపోర్టు అందినదని చెప్పారు. ఆ రిపోర్టు ప్రభుత్వానికి ఎప్పుడు చేరింది? ఇంతకాలమునుంచి యింజనీయరువద్దనుంచి వస్తుందనే ఆశిస్తున్నారా?

The Hon. Sri N. Sanjeeva Reddi — సభ్యులకు నేను యింతవరకు జవాబులుచెబుతున్నానంటే, నేను నాయొక్క memory మీద ఆధారపడి చెబుతున్నాను. Files కర్నూలునుంచి యింకా రాలేదు. అవి ఎక్కడో miss అయిపోయినవని అనుకుంటున్నాను. Files లేనందువల్ల నేను జవాబుచెప్పలేకపోవటానికి నన్ను క్షమించాలి.

## EXTRACTS FROM BIRTH AND DEATH REGISTERS

* 713 Q:— Sri G. C. Kondaiah:— Will the Hon. the Minister for Land Revenue be pleased to state

*(a)* whether the Government are aware of the fact that if a copy stamp application is filed in a Sub-Registrar's Office for a birth extract at 11 A. M., it is granted at 5 P. M. the same day, while it takes months in the Revenue Department with several check slips; and

*(b)* whether it is not beneficial to transfer all the birth and death registers to Sub-Registrar's Offices?

The Hon. Sri K. Koti Reddi:—

*(a)* The Government are aware that there are delays in the grant of certified copies. Instructions will be issued to the Administrative Officers of the Revenue Department to pay prompt attention to the grant of certified copies.

*(b)* The suggestion will be examined by the Government.

Sri G. C. Kondaiah — certified extracts యింకను రివిన్యూ డిపార్టు మెంటుద్వారానే యిస్తున్నారు. ఇంతకన్నా Sub-Registrar office ప్రతితాలూకా headquarters లోనూ పెట్టి, దానిద్వారా యీ licenses యివ్వటానికి ఏర్పాటు చేస్తారా?

1st June 1954]

The Hon. Sri K Kotti Reddi — 899 సంవత్సరానికి ముందువున్న రికార్డులుమాత్రమే రివిన్యూ డిపార్టుమెంటులోవున్నవి ఆ తరువాత రికార్డు Registration Department లోవున్నవి ఇదివరకే ఒకసారి యీ విషయము investigate చేశారు. ఇప్పుడు Sub Registrar office లో కావలసినంత accomodation లేనందువల్ల, రివిన్యూ డిపార్టుమెంటులోవుండే పుస్తకాలు అన్నియు తీసుకొనివచ్చి పెట్టాలంటే సాధారణముగా ఎస్టిమేట్లువేస్తే సుమారు 7, 8 లక్షలుదాకా కావలసివస్తుందని అన్నారు. అందువల్ల అది అప్పుడు ఆపుదలచేశారు అయినప్పటికిని దాన్ని మరల re-investigate చేసి, Registration Department కు entrust చేయటానికి ప్రయత్నముచేస్తాము. కాని యింతలోపుగా చేయాలంటే, వారికి అక్కడ హెచ్చుగా పని వుండడం వల్ల, కొంత delay అయితే అయివుండవచ్చు

Sri G C Kondaiah — రిజిస్ట్రారు ఆఫీసుకు డబ్బుపంపించేటప్పుడు, అంటే ఒకరూపాయ, అర్ధరూపాయ అనే చిన్న మొత్తాలు పంపించేటప్పుడుకూడా, M.O. ద్వారా పంపిస్తే, అవి రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటువారు ఒప్పుకోరు పదిమైళ్లదూరములోనున్నప్పటికిని స్వయముగా తాలూకా ఆఫీసుకువచ్చి చలానుద్వారా కట్టితేగాని, వారు accept చేయరు. అర్ధరూపాయికోసం పదిమైళ్లనుంచి రావాలంటే, దానికివేరే 5, లేక 10 రూపాయలు ఖర్చు అవుతుంది. ఆవిధంగా కాకుండా, పోస్టులో పంపితే accept చేయటానికి Registration Department కు తగిన instructions పంపిస్తారా? పోస్టులో పంపితే అభ్యంతరాలు ఎందుకువుండాలి?

The Hon Sri K Kotti Reddi — M. O. ద్వారా తీసుకోటానికి వీలుగా చర్యతీసుకోటానికి ఆలోచిస్తాను

Sri P. Pundarikakshacharlu — మంత్రిగారు ఆలోచిస్తానని అంటున్నారు సంతోషమే. రివిన్యూ డిపార్టుమెంటుకు పంపించేటప్పుడు లేని అభ్యంతరము రిజిస్ట్రేషను డిపార్టుమెంటుకు ఎందుకు ఉండాలో చెబుతారా?

The Hon Sri K. Kotti Reddi — Land Revenue కట్టేటప్పుడు M. O. ద్వారా పంపితేకూడా తీసుకుంటారు. అది రిజిస్ట్రేషను డిపార్టుమెంటుకు వుండకపోవచ్చు. అయినా కనుక్కుంటాను.

## STARTING OF CO-OPERATIVE TRAINING INSTITUTES

* 714 Q:— Sri Pragada Kotaiah:— Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state whether there is any proposal to start co-operative training institutes to coach up people for the sake of making the different varieties of existing co-operative societies operate with efficiency?

The Hon Sri D. Sanjivayya — Yes, Sir. There is a proposal under consideration for starting an Institute for training the lower subordinate staff in the Department.

Sri Pragada Kotaiah — అధ్యక్షా, ప్రస్తుతము సహకార సంఘాలలో సిబ్బంది - పనిచేసేవారికి తరిఫీదు యివ్వటానికి ఒక శిక్షణాలయమును ప్రభుత్వము ఏర్పాటు చేసింది. ఇటీవల హైకోర్టులో ఒక కేసువచ్చింది. అది Co-operative Societies లోని misappropriation కు సంబంధించిన కేసు దానిలో పంచాయతీబోర్డు ప్రెసిడెంటు మెంబర్లు సంతకము పెట్టటము చేతకాదని, అందుచేత వారికి శిక్షణ యివ్వడానికి ప్రభుత్వం పూనుకోవాలసి తీర్పుచెప్పారు సహకారసంఘాలసభ్యులకు ప్రత్యేకంగా శిక్షణ యివ్వటానికి ప్రభుత్వము పూనుకొంటుందా ?

The Hon. Sri D. Sanjivayya — పూనుకోదని నా సమాధానము.

Sri P. Pundarikakshacharlu —పంచాయతీబోర్డు ప్రెసిడెంటుకు శిక్షణకు సంబంధించినంతవరకు పూనుకోదని మంత్రిగారు చెప్పారు. కాని సహకారసంఘాలలో పని చేసే non officials గావుండే managers, paid Secretaries, అలాంటివారికైనా training యిప్పించటానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon Sri D Sanjivayya — అలాంటివారికి training యివ్వటానికి ప్రస్తుతము రెండు co-operative institutions వున్నవని అనుకొంటున్నాను.

Sri Pragada Kotaiah — వివిధరంగాలలో సహకారోద్యమాలకు సహాయము చేయాలని ప్రభుత్వము ఆలోచిస్తున్నప్పుడు ప్రజలకు సహకార సూత్రాలను అమలుజరప టానికి తగిన శిక్షణ యివ్వడమనేది మంచిదికాదా ?

The Hon. Sri D. Sanjivayya —ఇంకొక విద్యాలయముస్థాపించి అందులో శిక్షణ యివ్వాలనేవిషయము అవసరమన్నది యింకను నేను గుర్తించలేదు.

## DISTRICT BANJAR CONFERRNCE AT GUNTUR

* 716 Q :— Sri M. Narayanaswami :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

*(a)* whether it is a fact that the Police have given permission to the District Kisan Sabha to hold a public meeting at Guntur on 6-2-54 in connection with the District Banjar Conference ; and

*(b)* if so, what prompted the police to cancel the permission ?

1st June 1954]

The Hon. Sri N. Sanjeeva Reddi :—

(a) Yes, Sir. The Deputy Superintendent of Police, Guntur had given permission under Section 30 of the Police Act to the District Ryots' Association to hold public meetings on 6th and 7th February 54 as applied for.

(b) It is not correct to say that police cancelled the permission subsequently. It has been reported that the District Ryots' Association could not hold the public meeting on 6-2-54 as they did not have the permission of the Municipal authorities to hold the meeting in the Municipal Gandi Park on that day.

Sri A Venkatrama Raju — తెలుగులో సమాధానం చెప్పించండి.

The Hon. Sri N. Sanjeeva Reddi — గుంటూరుజిల్లా District Superintendent of Police 30వ సెక్షన్ ప్రకారము, జిల్లా రైతుసంఘంవారు 6, 7 తేదీలలో public meetings పెట్టుకొనడానికి అనుమతి యిచ్చారు. కాని, రైతుసంఘంవారు మీటింగు పెట్టుకొనుటకు Municipal Gandhi Park అధికారుల యొక్క అనుమతిని, పొందకపోవటంవల్ల వారు మీటింగు పెట్టలేదని తెలుస్తున్నది.

Sri M Narayanaswamy — అదేరోజున, ఆ Municipal park లో Congress వారు సభ జరిపారు వారికి Police అధికారులు permission యిచ్చారా?

The Hon. Sri N Sanjeeva Reddi — Municipal park లో meeting పెట్టుకొనడానికి అనుమతి యివ్వడానికి, పోలీసు అధికారులకు సంబంధంలేదు. అందుకు అనుమతి మునిసిపాలిటీవారే యివ్వాలి. అయినా files నాదగ్గర లేవు.

Sri Vavilala Gopalakrishnaiah — మొట్టమొదట పోలీసు వాళ్ళను కిసాన్ రైతుసంఘంసభ్యులు permission అడగటం జరిగింది. తరువాత కాంగ్రెసు నాయకులు ఆగ్రామానికిరావటం, కరపత్రాలు పంచిపెట్టటం, meeting జరుపుకోవటం జరిగింది. తరువాత పోలీసువాళ్లు, దయచేసి మేము వారు meeting నడుపుకుంటామంటే వూరుకొన్నాం అని చెప్పారు. Meeting పెట్టుకొనడానికి అనుమతి యిచ్చేందుకు అధికారము యిచ్చినపుడు పోలీసువారు Municipality వారి దగ్గరకుపోయి, "మీరు permission యివ్వవద్దు" అని చెప్పినసంగతి ప్రభుత్వానికి తెలుసునా?

The Hon, Sri N. Sanjeeva Reddi :— ప్రభుత్వానికి ఆసంగతి తెలియదు. Permission యిచ్చే అధికారము పోలీసువారికి వున్నపుడు, cancel చేసే అధికారముకూడా వారిచేతుల్లోనేవుంది. అందుచేత, పోలీసువారు ,మునిసిపాలిటీవారిని యెందుకు ప్రార్థించవలసి వచ్చింది? మీరుచెప్పినట్లు వారికి cancel చేసే అధికారము వున్నపుడు వారు దొడ్డిదారినపోయి అడుగవలసిన పని యేమివుంది?

Sri M. Hanumantha Rao — ఇప్పుడు సమస్య అదిగాదు. Deputy Chief Minister గారు పోలీసులకేమి అధికారము వుందని అన్నారు Municipality వారికివెళ్లిన ప్రతి అప్లికేషనూ పోలీసువారికికూడా పంపిస్తారు Circle Inspector దానిని sanction చేసి, పైకి పంపిస్తారు. అటువంటి సందర్భాలలో Municipality వారు Police వారికి తెలిపి, ఆ తరువాత Municipality వారు Congress వాదులుmeeting పెట్టుకొనడానికని, దీనిని తిరస్కరించారనే విషయం మాకు తెలుసు. తరువాత పోలీసువారికి మునిసిపాలిటీవారికి మధ్య యేమిజరిగిందో మాకు తెలియదు. అక్కడ కాంగ్రెసువాదులు meeting యేర్పాటుచేసేనిమిత్తం, కావలసినవారికి permission యివ్వకుండా, యింకొకరికి యిచ్చారు.

Deputy Speaker:— Is it a question ?

Sri M. Hanumantha Rao — Yes, it is a question. అందుచేత, కిసాన్ సభ్యులకు meeting పెట్టుకొనడానికి యిచ్చిన permission ను తిరస్కరించటం జరిగింది కనుక యిటువంటి అక్రమాలు యికముందు జరుగకుండా చేస్తారా ?

The Hon. Sri N. Sanjeeva Reddi .—అక్రమమైన పనులు జరిగాయని నేను వొప్పుకుంటే కదా, దానికి సమాధానము చెప్పవలసివుంటుంది. వారు Municipality వారికి application పంపించినప్పుడు, వారు పోలీసువారికి పంపించారన్నారు. పోలీసులు permission యివ్వలేదని మీరు అనడానికి వీలులేదు. దానిని యెవ్వరూ contradict చేయలేరు పోలీసువాళ్లు interfere కాకుండానే, Municipality వారు permission యివ్వకుండా చేశారు. అదీ అసలువిషయం. పోలీసువారు వారికి యిచ్చిన permission ను రద్దుచేయడానికి యెప్పుడూ అధికారమువున్నది. (Interruption వారి Emergency power మీద రద్దుచేయవచ్చా ?) Emergency power మీద కొట్టివేయవచ్చునని చెబుతున్నాను. కాబట్టి అందులో కుట్రవున్నట మనేది యేమీలేదు. గుంటూరుపట్నం పెద్దపట్నం కాబట్టి, అక్కడ యిద్దరూ రెండు meetings పెట్టుకోవచ్చును. ఇప్పుడు, యిక్కడ Assembly లో కాంగ్రెసువారూ, కమ్యూనిస్టులు వున్నట్లుగా, అదేవిధంగా అక్కడ యిద్దరూ రెండుమీటింగ్సు పెట్టుకోవచ్చు ఏ పరిస్థితులలో Municipality వారు permission యివ్వడానికి refuse చేశారో తెలియదుకాబట్టి ప్రత్యేక ప్రశ్నవేస్తే మంచిది. అందువల్ల ప్రత్యేక ప్రశ్నవేస్తే, ఆ విషయం విచారించి, సమాధానము చెబుతాను.

Sri V. Srikrishna .— శ్రీ హనుమంతారావుగారు వేసినప్రశ్న, Deputy Chief Minister గారికి స్పష్టంగా తెలియలేదు.

పోలీసువారికి application పెట్టేముందు మ్యునిసిపాలిటీనుండి పార్కులో meeting పెట్టుకొనుటకు అనుమతి తీసుకొని, D y S. P. ని permission కు

; approach అయ్యారు. Dy. S P. గారు clashes వస్తాయని చెప్పి, ఒకరికే rmission ఇచ్చారు ముందుగా ఒకరికి permission యిచ్చినతరువాత, రెండవ ర్టీకి permission యివ్వడానికి యెక్కడ అవకాశముకల్గుతుంది? మొదట permission తరువాత cancel చేయడానికి కారణమేమిటి?

The Hon. Sri N. Sanjeeva Reddi — పోలీసువారు cancel చేశారని గారు చెబుతున్నారు Municipality వారు permission యివ్వలేదని నాకువచ్చిన informationలో వుంది. Municipality వొప్పుకోకుండాపోవటంవల్ల వారు వొప్పుకో లేదని నాకు information వచ్చింది. I believe that my information is correct.

Sri K Rajagopala Rao — అసలు యీ permission అనేది పెద్ద న్యూసెన్స్‌గా తయారైనది. ఒక meeting పెట్టుకోవాలంటే, దానికి Police వారు permission యివ్వాలి. ఈ permission యివ్వటంలో చాలా సాధక బాధకాలు వున్నవి. అందుకు చాలాకష్టం అవుతున్నది. అందుచేత, యీ పద్ధతి తీసివేసి, మీటింగు పెట్టుకొనడానికి అందరికీ freedom కలుగజేస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi — Freedon is limitted to an extent.

ఒకే ప్రాంతంలో యిద్దరూ meetings పెట్టుకోవచ్చు. ఒకే పార్కులో meetings పెట్టుకొనడానికి, permission యిచ్చే హక్కు పోలీసువారిదే. అక్కడ meeting సక్రమంగా నడిపించేబాధ్యత వారిదే.

Sri M. Hanumantha Rao — My question is not answered, Sir, మంత్రిగారు మామీద responsibility పెడుతున్నారు. దానికి కొంత జవాబు చెప్పవలసి వుంది.

Deputy Speaker — తరువాత ప్రశ్నను తీసుకుంటున్నాను.

Sri M. Hanumantha Rao — మీరు చెప్పకముందే లేచాను.

## HEALTH INSPECTORS' LEAGUE ASSOCIATION HELD AT KURNOOL

* 717 Q:— Sri S. Narayanappa.— Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state:

whether the Government are aware of the resolutions passed in the recent Health Inspectors' League Association held at Kurnool under the Presidentship of the Hon. the Minister and if so, the action taken thereon.

The Hon. Sri D. Sanjivayya — Yes. The matter is under the active consideration of the Government.

Sri S. Narayanappa — ఈ హెల్తు యిన్స్పెక్టర్ల Association వారి conferenceలో వాళ్లు pass చేసిన తీర్మానాలు యేమి? వాటి వివరాలు తెలుపుతూ వాటిమీద తీసుకొన్నచర్యలు ఏమో చెబుతారా?

The Hon Sri D Sanjivayya — ఈ సమావేశములో వారు ఆమోదించిన తీర్మానములు చాలావున్నవి. వాటినన్నిటిని చదవుటకు యీ శాసనసభా కాలము యెంతో తీసుకోవటం అవుతుంది. కనుక, మీరంతా చదవమంటే చదువుతాను.

The resolutions are as follows:

(1) that the name of the Association which has been named as the Andhra State Health Inspectors' Association consequent on the formation of the Andhra State may be recognised by the Government;

(2) that the scale of pay of the Health Inspecters be revised from Rs. 60-8-90 EB-4-130 to Rs. 80-5-160;

(3) that in the interest of the efficient admnistration of the Public Health Department in this State the educational qualification prescribed for the Sanitary Inspectors' course be revised as Intermediate instead of S. S. L. C.,

(4) that the fixed travelling allowance of Rs. 33/- per mensem now sanctioned to the Health Inspectors be enhanced to Rs. 45/- per mensem;

(5) that the required number of Health Inspectors in reserve duty in each district may be appointed and that whenever their services are required outside the district they may be posted to the adjacent district and for this purpose the State may be divided into four or five zones;

(6) that facilities may be afforded to such of the Health Inspectors who wish to undergo L. P. A. course by relaxing the necessary rules to qualify themselves for promotion in the department;

(7) that the provision requiring Health Inspectors to pass a second vernacular may be cancelled;

(8) that the various categories of Public Health staff in the State may be provincialised and made a homogeneous unit;

1st June 1954]

(9) that necessary instructions may be issued to the Andhra Public Service Commission to recruit candidates who have worked as Health Inspectors on special duty like cholera, malaria under Rule 9A (1) and others that appear for selection as Health Inspectors as is being done in the case of those that worked as Plague inspectors;

(10) that uniform allowance may be sanctioned to Health Inspectors as is being given to the Sanitary Inspectors under local bodies.

Detailed remarks of the Director of Public Health have been called for and are awaited. The request will be examined in detail in consultation with Finance As soon as the remarks of the Director of Public Health are received orders of Government will be issued.

## ELECTRICITY POWER SUPPLY ZONES IN THE STATE

* 718 Q.— Sri S. Vemaiah — Will the Hon. the Deputy Chief Minister be pleased to state

*(a)* the number of electricity power supply zones in Andhra State;

*(b)* the areas comprising in each zone?

The Hon. Sri N. Sanjeeva Reddi.—

*(a)* Four zones.

*(b)* 1. Srikakulam, Visakapatnam, East Godavari, West Godavari, Krishna and Guntur Districts.

2. Kurnool, Anantapur and Cuddapah Districts.

3. Nellore District.

4. Chittoor District.

(a) నాలుగు జోన్లు ఉన్నాయి.

(b) 1. శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణ, గుంటూర్లు.

2. కర్నూలు, అనంతపురం, కడప.

3. నెల్లూరు.

4. చిత్తూరు.

## LABOUR CONTRACT SOCIETIES IN THE STATE

* 719 Q.— Sri A. Venkatarama Raju — Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state.

*(a)* whether the Government have started Labour Contract Societies in our Province,

*(b)* the amount of loan that will be granted to these Societies in proportion to their share capital,

*(c)* whether the loans are granted by the Government or by the Co-operative Banks on Government responsibility;

*(d)* the amount of share capital to be collected for getting the Society registered, and

*(e)* whether the Government works will be given to these societies without the system of calling tenders having regard to its ability in its area?

The Hon. Sri D Sanjivayya :—

*(a)* Yes, Sir, అవును.

*(b)* The borrowing limit of these Societies depends upon their paid-up share capital and reserve fund. Tne maximum borrowing limit is generally fixed at 5 times the paid-up share capital and reserve fund.

వీళ్లు banksలో నుంచి, ఇంకా ఇతరచోట్లనుంచి డబ్బు అప్పుగా తీసుకోనేపరిమితి వారివాటా ధనాన్ని అనుసరించి ఉంటుంది. వసూలైన షేర్ ధనం, రిజర్వునిధులకు అయిదు రెట్లవరకు ఆ సంఘాలు అప్పు తీసుకోవచ్చు.

*(c)* Loans are granted to these societies by District Co-operative Central Banks subject to the limit fixed in the by-laws taking into account the general working of these societies and the security they could offer for the funds advanced. Government do not grant loans to these Societies nor do they give guarantee to the Co-operative Central Banks for loans advanced by them to these societies.

జిల్లా కోపరేటివ్ సెంట్రల్ బ్యాంక్స్‌నుంచి ఇంతకుముందు రెండవభాగంలో చెప్పినట్లు వాళ్లు అప్పుతీసుకోవచ్చు. ప్రభుత్వం వారికి అప్పులు ఇవ్వదు. లేదా సెంట్రల్ బ్యాంక్‌ల నుంచి అప్పుతీసుకుంటే వాళ్ళకు ఎలాటి హామీ ఇవ్వదు.

1st June 1954]

*(d)* A minimum share capital of Rs. 1,000/- is necessary for the Society to get itself registered. Where a Society proposes to take up fairly large works, more share capital is required.

మామూలుగా షేరుధనం వెయ్యిరూపాయలు ఉంటేగాని పనులు contract తీసుకోడానికి వీలులేదు. పెద్దపెద్ద పనులు తీసుకొనవలెనంటే ఇంకా ఎక్కువ షేర్ మొత్తం కూడా అవసరం.

*(e)* According to the orders of Government on this subject Labour Contract Co operative Societies are entrusted by the Local Boards and Public Works Department with works, the estimated cost of which does not exceed Rs. 2,500/- without the usual tenders being called for, in preference to private contractors. In all other respects, they are treated as on a par with private contractors.

ఈ పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంట్, స్థానికసంస్థల క్రింద ఉన్నపనులు రు 2,500 లకు మించనివి వీటికి ఇవ్వబడుతున్నవి. మిగతావిషయాల్లో అందరు contractorsతో బాటు పోటీచేయాలి.

Sri A. Venkatarama Raju :— ఈ సొసైటీలను నిర్మించడంలో ముఖ్య మంత్రిగారు వాటికి ప్రోత్సాహం ఇస్తాం అని చెప్పడంకూడా జరిగింది. అయితే ఈ సొసైటీలను రిజిష్టరు చేసినప్పుడు రిజిస్ట్రారుగారు చెప్పినదానికి, ఇప్పుడు మీరు చెప్పినదానికి తేడావస్తున్నది. గవర్నమెంట్ షెడ్యూల్ రేట్లప్రకారం వాళ్లకు ప్రిఫరెన్స్ ఇవ్వడానికి ప్రయత్నంచేస్తారా ?

The Hon. Sri D. Sanjivayya :— ఆలోచించి చేస్తామని చెపుతున్నాను. షెడ్యూల్ రేట్లకంటె కూడా తక్కువకు చేస్తామని వచ్చినప్పుడు వాళ్లకు ఎంత లాభదాయకంగా ఉంటుందనేదికూడా ఆలోచించి ఆ విధంగా చేస్తాం

Sri B. Sankarayya :— P. W. D. వారు scheduled ratesకు ఇస్తాం అని చెప్పారు. రెండువేల అయిదువందలరూపాయలలోపు పని ఇస్తామని చెప్పారు. కాని నెల్లూరు ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ ఆ విధంగా యివ్వడానికి వీలులేదని చెప్పారు. కాబట్టి మీరు చెప్పినవిధంగా అమలుచేయడానికి ప్రయత్నం చేస్తారా ?

The Hon. Sri D. Sanjivayya :— విచారిస్తాం.

Sri Saka Venkata Rao :— నేను కాకినాడ Deputy Registrarను కలుసుకొంటే తాలూకాకు ఒక కంట్రాక్టు సొసైటీకంటె ఎక్కువ రిజిస్టర్ చేయడానికి వీలులేదని చెప్పారు. మొత్తం తాలూకా అంతటికి ఒక సొసైటీని ఆర్గనైజ్ చేయడం కష్టం కాబట్టి ఫిర్కాకు ఒకటి చొప్పున ఇస్తారా ?

[1st June 1954

The Hon Sri D Sanjivayya — తాలూకాకు ఒకటే అని చెప్పినట్లు నాకు తెలియదు. ఆ విధంగా ఉంటే నేను విచారిస్తాను అది ఒక పెద్దతాలూకా అయి, విశేషంగా జనాభాకలిగి ఉంటే ఆ విధంగా ఉండటం అన్యాయంగా ఉంటుంది కాబట్టి దాన్ని విచారిస్తాను.

Sri M Hanumantha Rao — ఈ షెడ్యూల్ రేట్లకంటె కంట్రాక్టర్లు తక్కువదబ్బు పెట్టి పని బూటకంగా చేస్తారనేది, కూలీకూడా సరిగా ఇవ్వరనేది ప్రభుత్వానికి కూడా తెలుసు. అటువంటప్పుడు ఈ సొసైటీలకు ఇస్తే పని సరిగాజరుగుతుంది. ఆ విధంగా చేస్తారా?

The Hon Sri D. Sanjivayya — పని బూటకంగా జరుగుతుందనేది నేను ఒప్పుకోను. దానిమీద మన Department వారు supervise చేస్తూంటారు.

Sri K Krishna Rao — ఈ సొసైటీలు వెయ్యిరూపాయలు కడితేగాని, రిజిస్టరుకావని చెపుతున్నారు. అటువంటివాళ్లకు రు. 2,500 ల పని ఇవ్వడం జరుగుతుందని చెప్పారు. ఇంతకంటె తక్కువ share capital గలవాటిని రిజిస్టరుచేసుకోడానికి ప్రయత్నిస్తారా?

The Hon. Sri D. Sanjivayya — వెయ్యిరూపాయలూ తప్పకుండా కట్టితీరాలని ఏమీలేదు. ప్రత్యేకపరిస్థితులలో అయిదువందలు కట్టకలిగితే కట్టవచ్చు. అటువంటివాటినికూడా రిజిస్టరుచేయడానికి మాకు అభ్యంతరమేమీ లేదు.

Sri A Venkatarama Raju :— వెయ్యిరూపాయలు షేర్ కాపిటల్ ఉంటే రెండువేల అయిదువందల రూపాయల పనిమాత్రమే ఇచ్చేదానికి ఎందుకు మీరు నిర్ణయించారో తెలియడంలేదు. దాన్ని ఆపుచేయడానికి ప్రయత్నిస్తారా? Contractors కు Department కు ఉన్న సంబంధంబట్టి ఈ సొసైటీలు పోటీచేయడం ఎలా సాధ్యమౌతుంది?

The Hon. Sri D Sanjivayya :— రెండువేల అయిదువందలు ఇవ్వడానికి ఎప్పుడో ఉత్తరువులు ఇవ్వబడ్డాయి. అవి ఏ కారణంవల్ల ఇవ్వబడిందీ కూడా మనం విచారించాలి. పెద్దపెద్ద పనులు చేయడంలో వాళ్లకు చేయగల తాహతు ఉందా లేదా ఆ పని నిర్విఘ్నంగా బాధ్యతతో నిర్వహించగలరా అని కూడా మనం ఆలోచించాలి.

Sri. V. Chidanandam :— ఒక్కొక్క తాలూకాలో రెండు labour societies పెడితే వారిలో వారికి తగాయిదాలు ఏర్పడి వాటి ఉద్దేశ్యానికే భంగం కలుగదా! వాటికి డబ్బు పెట్టుబడిపెట్టడానికి షాహుకార్లుకూడా ఆ సంఘాలలో చేరవచ్చునా?

The Hon. Sri D. Sanjivayya :— ఒక తాలూకాలో రెండు సంఘాలు ఉంటే, వాళ్లలో పోటీరావచ్చుకదా అంటే, పోటీరాకుండా చేసుకుంటారు. దానిలో

సింప్లై జర్స్, పెద్ద షాహుకార్లుకూడా చేరవచ్చు. వారు అలా చేరడంవల్ల ఆ లాభాలు హరిస్తారేమో అని కూడా ఉంది. వాటన్నిటినీ అరికట్టడానికి department ఉద్యోగులు చూస్తుంటారు.

Sri M Veerabhadram — Contractors కు పనులు యిచ్చే సందర్భంలో వాళ్లు తప్పనిసరిగా లాభం తీసుకోవాలనేదృష్టితో పనిచేస్తారు. అందువల్ల పనులు సరిగా ఉండడంలేదు అందువల్ల ఈ Labour Co-operative Societiesకు contracts యిచ్చినట్లయితే, labourers కు un-employment అనేది కొంతవరకు తగ్గుతుంది. 10 వేలరూపాయలకు ఏదైనా పనిని contractorsకు యిచ్చేటట్లయితే దానిని 4భాగాలుగా విభజించి 4 సొసైటీలకు యిచ్చినట్లయితే బాగుంటుంది. ఆ విధంగా చేయడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా !

The Hon. Sri D. Sanjivayya — వాళ్లు కొంత share ధనం ముందుగా కట్టాలి. వాళ్లవద్దనుంచి share ధనం తీసుకొని వారియొక్క ఆర్థికస్థోమతనుబట్టి చూడాలి వారికి స్థోమత ఉండాలి.

## CONSTRUCTION OF BEGGAR HOME AT NELLORE

* 720 Q —Sri S. Vemaiah:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

*(a)* whether the Government have received any representation from Nellore in this year requesting subsidy for the construction of Beggar Home; and

*(b)* if so, the action taken thereon ?

The Hon. Sri N. Sanjeeva Reddi :—

*(a)* "The answer is in the negative".

*(b)* "Does not arise".

Sri S. Vemaiah — ఈ విషయంగురించి చాలా Food Committeeలు చాలా Planning Committeeలు కూడా తీర్మానములు pass చేశాయి. ఆ విధంగా తీర్మానములుచేసి ప్రభుత్వానికిపంపినట్లు తెలిసింది. Beggarsకు, shelters ఏర్పాటు చేయాలని ప్రభుత్వానికి ఒక విజ్ఞప్తిచేస్తూ తీర్మానించారు. ప్రభుత్వం అందుకు పూనుకుంటుందా ? అని అడుగుతున్నాను.

The Hon Sri N. Sanjeeva Reddi — ఒక నెల్లూరులోనే beggars ఉన్నారని కాదు, అన్నిచోట్లా కూడా ఉన్నారు. ప్రభుత్వం అటువంటి సౌకర్యములన్నీ కలుగచేద్దామని ఆలోచిస్తూంది. కాని ఆర్థికపరిస్థితులు చక్కబడలేదు. ఆర్థికపరిస్థితులు చక్కబడినతరువాత ఈ విషయంగురించి ఆలోచిస్తాము. వారికి సౌకర్యములు కలుగజేయడానికి ప్రభుత్వం తప్పకుండా ప్రయత్నిస్తుంది.

Sri C. V K Rao — ఈ beggar problem అన్నిగ్రామాలలో అన్ని పట్టణాల్లోను, ప్రతిచోట చాలా ఎక్కువగా ఉంది. మునిసిపాలిటీ areasలో beggersకు తగినవసతి సౌకర్యములు కల్గించడానికి మునిసిపాలిటీలు సగం, ప్రభుత్వం సగంఖర్చు భరించి beggar homes కట్టించాలి వాటిని నిర్మించడానికి ప్రభుత్వం ఏమైనా ప్రయత్నం చేస్తుందా?

The Hon. Sri N. Sanjeeva Reddi — Municipal Chairmanగా ఉన్నటువంటి C. V. K. Rao గారు చేసిన సూచన బాగానేఉంది. కాని దానిని examine చేసి ఒక plan యివ్వండి, దానిమీద మేము ప్రయత్నిస్తాము.

Sri L. Lakshmana Dass — ఇపుడు ఈ beggarsలో అంటువ్యాధులు కలవారు ఎక్కువమంది ఉన్నారు. వారు bus లలో కూడా ప్రయాణంచేస్తున్నారు. వారికి అంటురోగాలు లేకుండా కనీసం treatment యివ్వాలి. లేకపోతే వారితో ప్రయాణంచేసే passengersకు వాళ్ల అంటురోగాలు అంటుకుని చాలా బాధపడుతారు. అందుచేత వారికి treatment యివ్వడానికి ప్రయత్నిస్తారా ?

The Hon Sri N. Sanjeeva Reddi :— లక్ష్మణదాసుగారు చెప్పింది చాలావరకు health pointకు సంబంధించినది. చాలా బాగానేఉంది. కాని మనరాష్ట్ర ప్రభుత్వముయొక్క ఆర్థికపరిస్థితి బాగుగాలేదు. మొత్తం మనరాష్ట్రంలోని beggars అందరికీ shelter కల్పించి, ఇంకా treatment మొదలైన సౌకర్యములు కల్పించాలి అంటే లక్షలతోకూడా అయ్యేపనికాదు. Beggar problem చాలా డబ్బుఖర్చుతో కూడినపని మంద్రాసులో గవర్నమెంట్, కొన్నిసంస్థలుకలిసి beggar home కట్టించారు. కాని అందులో succeed కాలేకపోయారు. మన ఆంధ్రరాష్ట్రంలో చాలా మంది beggars ఉన్నారు. చాలాడబ్బు కావాలి. అందువల్ల ఈ విషయమై ఆలోచించాలి.

1st June 1954]

Sri G. Nagabhushanam:— Sir, we want Beggar Homes immediately, implementation of elementary education and so on. I want to know whether there is sufficient money in the State for all these?

The Hon. Sri N. Sanjiva Reddi ·—Within our limited resources we will have to devote it for all the useful work.

## POLICE CONSTABLES BROUGHT TO WALTAIR SESSION

* 700A Q:— Sri S. Vemaiah:— Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

*(a)* number of police constables brought to Waltair from other districts for Waltair Session; and

*(b)* the expenditure iucurred towards Travelling Allowance and Daily Allowance charges till 10-5-55?

The Hon. Sri N. Sanjeeva Reddi:—

*(a)* None, Sir,

*(b)* Does not arrise.

The Hon. Sri N. Sanjeeva Reddi —ఇతరజిల్లాలనుంచి బందోబస్తుకోసమని Police Constables, ఈ వాల్తేరుకు తీసుకురాలేదు. ఈ జిల్లాలోనివారినే, ఈ పట్టణంలోనివారినే ఈ Assembly పరిసరప్రాంతంలో Assembly చుట్టూ అల్లరులు జరగకుండా శాంతిభద్రతలు ఇక్కడ కాపాడడానికి, మీ రక్షణకొరకు 20 మందిని తీసుకు రావడంజరిగింది వారిని ఎక్కడైనా duty మీద పెడితే ఏ సౌకర్యములు ఉంటాయో ఆ సౌకర్యములే వీరికికూడా కల్పించబడ్డాయి.

Sri S. Vemaiah ·— అధ్యక్షా! లోగడ కర్నూలుకు, ఉత్తరజిల్లాలనుంచి కుటుంబాలుగల చాలామంది పోలీస్ Constables ను తీసుకువచ్చారు. కనీసం, కుటుంబాలు గలవారిని వారివారి స్వస్థలములకు వెనుకకుపంపించి Bachelorsను అట్టేపెట్టి వారిస్థానంలో ఇంకా కొంతమంది Bachelors ను తీసుకురావడానికి, ప్రభుత్వం ప్రయత్నం చేస్తారా?

The Hon. Sri N. Sanjeeva Reddi ·— ఈ ప్రశ్న వాల్తేరునుంచి మొదలుపెట్టి, తరువాత కర్నూలుపరకూ పోయింది. అసలు ఈ కుటుంబాలతో ఉన్నవారిని ఇతరజిల్లాలనుంచి తీసుకువచ్చాము. కుటుంబాలతో ఉన్న అనుభవంగలవారిని కర్నూలుకు తీసుకురావడంజరిగింది. అక్కడ కర్నూలులో కొంతమంది కొత్తవారికి training యిస్తున్నాం. వారికి training అయ్యేవరకు వారిని తప్పనిసరిగా ఉంచుతాము. కొత్తవారికి training పూర్తి కావచ్చింది. సాధ్యమైనంతత్వరలో కుటుంబాలున్నవారిని వెనుకకు పంపడానికి ప్రయత్నిస్తాము.

Sri M. Hanumantha Rao —మా రక్షణ కొరకు పోలీసువారిని తీసుకొచ్చామన్నారు; అలా వచ్చినవారిలో నర్సీపట్టణంనుంచి వచ్చిన Dy. S. P మమ్మల్నిగురించి ఇంకొక Dy. S P తో, "వీళ్లని ఇపుడే ఫోటోలుతీయాలి. లేకపోతే మళ్లీ దొరకరు, మళ్లీ వీళ్లు Underground లోకి పోయేకాలం వచ్చింది." అని అన్నారు. వారికి ఈ విధంగా ఫోటోలుతీయమని ఏమైనా instructions ఇచ్చారా? అందుకోసమై కెమేరాలను వారికి సప్లయ్ చేశారా? ఈ విషయాలను తెలియజేస్తారా?

The Hon Sri N. Sanjeeva Reddi — అసలు ఈ విధమైనటువంటి instructions కనుక ఇచ్చిఉంటే ఈ Department వారు Photos చెప్పితీయరు, చెప్పకుండానే తీసేస్తారు అసలు ఈ Department లో ముందుచెప్పి Photo తీసేటంతటి తెలివితక్కువ Dy S P. ఎవరూ ఉండరు. అటువంటి instructions ఏమీ వాళ్లకు లేవు అయినా ఫోటోలుతీయించుకోవాలంటే Assembly సభ్యులంతా dinner పార్టీలు ఏర్పాటు చేసుకోవచ్చు. ఇపుడు మీరూ, ఫోటోలుతీయించుకోడానికా మరిగారు. మీరూ మేమూకూడా కలిసి photo లు తీయించుకోవచ్చు.

Sri R. V. Jagga Rao — అధ్యక్షా! ఇక్కడికి duty మీద తీసుకువచ్చిన constables కు 12 అణాలు బత్తాయిస్తున్నారు. అది 1 భోజనమునకు మాత్రమే సరిపోతుంది. Tiffin కి, 2 పూట్ల భోజనానికికూడా చాలదు. అందుచేత వానికి ఆ బత్తాను ఎక్కువచేయడానికి ప్రభుత్వం ఏమైనా ఆలోచించి ఏర్పాట్లుచేస్తుందా?

The Hon. Sri N Sanjeeva Reddi — ఇది general గా ఆలోచించవలసిన విషయం దీనినిగురించి ఆలోచించుతాము. ఈ 12 అణాలబత్తా ఒకపూట భోజనానికి మాత్రమే చాలుతుందని నాకూ తెలుసును. ఈ విషయమై ఆలోచించి ఒక నిర్ణయానికి రావాలి.

Sri R. Siddanna Gowd — Assembly Member లు రక్షణనిమిత్తం ఈ పోలీస్ వాళ్లని తీసుకువచ్చామని మంత్రిగారు చెప్పారు. వాళ్లను తీసుకురావడం మాకోసంకాదు. మేము ఈ యూనివర్శిటీ ఆవరణలోగల శాంతి వాతావరణంలో ఉన్నాము. మంత్రులే బైటకున్నారు. వారి రక్షణకోసమే వీరిని తీసుకువచ్చారనుకుంటున్నాను.

The Hon. Sri N. Sanjeeva Reddi — మేము సముద్రమునకు దగ్గరగా చల్లటి వాతావరణంలో, సముద్రపు రక్షణక్రింద ఉన్నాము మాకేమీ రక్షణ అవసరంలేదు.

# ADJOURNMENT MOTION RE:

## Andhra Paper Mills, Rajahmundry.

Sri C. Prabhakara Chowdary — I move

That the House do adjourn to discuss a matter of urgent public importance, namely the situation created by the accumulations of stock of paper in the Andhra Paper Mills. Rajahmundry, due to the system of the distribution of stocks through the distributing agency in Madras and not to the Andhra districts direct from the mills, and the breakdown of the machinery due to neglect of timely repairs resulting in the mills closing down and workers rendered workless.

Deputy Speaker — దయచేసి మీరు కూర్చోండి దాంట్లో మీరు చెప్పినది వున్నదికదా.

Sri C. Prabhakara Chowdary —దానికి మంత్రిగారు ఏమి చెబుతారో?

Deputy Speaker — నేను చెబుతున్నాను, మంత్రిగారు చెప్పడం ఎందుకు? దీంట్లో administrative responsibility వున్నదని అనకోను.

Sri P. Venkateswarlu .— అధ్యక్షా.

Deputy Speaker .— నేను నిలబడి మాట్లాడుతూవుండగా May's Parliamentary practice బాగా చదివిన వెంకటేశ్వర్లుగారు 'అధ్యక్షా, అధ్యక్షా' అని నిలబడడం బాగులేదు. దీంట్లో administrative responsibility లేదని, తరువాత దీంట్లో public importance కూడ లేదు అని అనుకుంటున్నాను. అందుచేత యీ adjournment motion ను disallow చేస్తున్నాను.

DISCUSSION ON

# ELEMENTARY EDUCATION COMMITEE REPORT

Sri K. Rajagopala Rao :— Mr. Deputy Speaker, Sir, తమరు ఆ రోజున Chair లో లేరనుకుంటాను. Speaker గారు ప్రాథమిక విద్యావిధాన విచారణ సంఘం రిపోర్టుమీన చర్చించడానికి ప్రత్యేకంగా అవకాశంకలిగించబోతున్నాం అని స్పీకరు గారు చెప్పారు. ఇవ్వాళ వెళ్లిపోతాం అనుకుంటాను. వ్యవధి అట్టేవున్నట్టు కనబడలేదు. తమరిని క్లిష్టం అయిన పరిస్థితులలోవుంచాలనిగాని, ఒత్తిడిచేయాలనిగాని మనవిచేయడంలేదు. చర్చకు అవకాశంలేదు కనుక ఒకటి రెండు విషయాలమీద ప్రభుత్వవిధానం తెలుపవలసిన

[Sri Rajagopal Rao] [1st June 1954

అవసరంవున్నది. రేపో మాపో schools re open చేస్తున్నారు. రేపో మాపో ఈ modified scheme రద్దుచేసేవిషయంలో కొంత time తీసుకోవచ్చు. Modified scheme పోయి పాతవిధానంవస్తే యీ మధ్యలో సంవత్సరంనుంచి వున్నపీడ విరగడ అయిపోతుంది.

Sri B. Krishnamurthy Rao :—(on a point of personal explanation, Sir. .

Dy. Speaker — రాజగోపాలరావుగారిని పూర్తిగా చెప్పనియ్యండి.

Sri K. Rajagopala Rao — కమిటీ సిఫార్సులన్నీ అమలు జరపడానికి పూనుకుంటారా? లేకపోతే స్కూల్సు re-open చేస్తారు గనుక యీలోగా ప్రధానమైన విషయమైన Modified Elementary Education Scheme ను రద్దుచేసేవిషయంలో ప్రభుత్వ దృక్పథం ఏమిటి? అది మంత్రిగారిచేత చెప్పించండి. పాతవిధానం రావాలని వెంటనే G. O. యిచ్చినట్టయితే యీ modified విద్యావిధానంపీడ వదలిపోతుంది

Sri Vavilala Gopalakrishnaiah — 3 గంటల చర్చకు అనుమతియిస్తే లేకపోతే యీ కమిటీసిఫార్సులను అమలులోపెడతాం అని ఒక statement యిచ్చినట్టయితే 3 గంటలుకాలం మిగులుతుంది.

Deputy Speaker — రాజగోపాలరావుగారు చెప్పినదే మీరు మళ్లీ చెబుతున్నారు.

Sri Vavilala Gopalakrishnaiah — దీంట్లో ఒక point మీద చర్చ తీసుకోము అని అన్నారు. మొత్తం రిపోర్టుమీద ప్రభుత్వం ఏ అభిప్రాయంతోవుందో ఏ విధానం అనుసరిస్తారో మొత్తంగా చెప్పమని నేను అడుగుతున్నాను.

Sri B. Krishnamurthy Rao — చిన్న మనవి.

Deputy Speaker :— Personal explanation చెప్పడానికి, అడగడానికి తమకు అధికారంవున్నదనుకోను. మినిస్టరుగారు అడగాలి అభ్యంతరంవుంటే.

Sri B. Krishnamurthy Rao :— Unanimous గా యిచ్చిన కమిటీ రిపోర్టులో ఉన్నదానికి భిన్నంగా శ్రీ రాజగోపాలరావుగారు చెప్పారు.

Deputy Speaker :— పూర్తిగా చెప్పండి.

Sri B. Krishnamurthy Rao: — ఏకగ్రీవంగా అన్ని రాజకీయపక్షాల శాసనసభ్యులు అంగీకరించి ఒక విద్యావిధానప్రణాళిక తయారుచేసివున్నారు. దానిని అమలుజరపడానికి ప్రభుత్వం ఆలోచనచేయాలని కోరాలిగాని యిప్పడున్నవిధానం రద్దుచేసి పాతవిధానం తీసుకురావాలని మాత్రం చెప్పట సబబు కాదు. ఈ కమిటీ యిచ్చినట్టి రిపోర్టు సమగ్రంగా పరిశీలించి అమలుజరపాలని కోరుతున్నాను.

1st June 1954]

Sri K. Rajagopala Rao — దానిని పరిమితం చేయడం నా వుద్దేశంకాదు. ఏకగ్రీవంగా యీ రిపోర్టును అంగీకరించి అమలుపరచవలెనంటే దానికి కూడా అవకాశం వున్నది. రేపు స్కూల్సు తెరుస్తారు కనుక దానిగురించి point out చేశాముగాని limit చేయడం నా వుద్దేశంకాదు.

Sri T Nagi Reddi — చర్చించాల్సినవిషయం ఏమీలేదు. ఒక ఏకగ్రీవమైన రిపోర్టు వచ్చింది. Next step ఏమి తీసుకుంటారు? జూను నెల వచ్చింది అమలుజరపుతాం అని మంత్రిగారు చెబితే సరిపోతుంది.

The Hon Sri S. B P. Pattabhirama Rao — అధ్యక్షా! అసలు ఈ విషయం నేను చెబుదాం అనుకున్నాను. ఈవేళ ఎల్లాగూ అవకాశంలేదు గనుక చర్చ చేయడానికి ప్రత్యేకంగా నేను చెబుదాం అనుకున్నాను కాని రిపోర్టు వ్రాసినవారే యింత వరకు చెబుతూ ఉన్నందువలన వారి వాదంలో నేను వెనుకబడిపుంటిని, అంతకంటె ఏమీలేదు.

Sri T. Nagi Reddi — అంతమాత్రంచేత పోయినదేమీలేదు.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao — అసలువిషయం గురించి లోగడ చెప్పివున్నాను. మరచిపోయారేమో. Report unanimous గా వచ్చినపుడు ముఖ్యంగా యీ సంవత్సర జూను నుండే ప్రారంభింపబడేస్కూళ్లలో అమలు జరుపడం అనేది వీలయినంతవరకు ఆలోచిస్తామని యిదివరకే చెప్పాను. Assurance కోరుతున్నట్టు కనబడుతుంది. ఇన్నాళ్లూ నడుస్తున్న విద్యావిధానంమాత్రం అమలులో ఉండదని చెప్పుచున్నాను. ఇప్పుడు యిందులో ముఖ్యమైనరిపోర్టు ఏకగ్రీవంగా యిచ్చారు. దీనిని ఏవిధంగా అమలు జరపాలో వారి recommendations పరీక్షచేయనిదే కమిటీరిపోర్టు అనుసరించమనడం ధర్మంకాదు. ఆర్థికానికి సంబంధించినవిషయాలు వున్నవి. తరువాత పెద్దపెద్ద సమస్య లున్నవి. Aided Schools system రద్దువిషయంలో నేను కూడా ఒకప్రశ్నకు జవాబుచెబుతూ Aided schools తీసివేయాలని యీ రిపోర్టు రాకపూర్వమే చెప్పాను. నాయొక్క అభిప్రాయాన్నే రిపోర్టులోకూడా చెప్పినందుకు ధన్యుడను అనుకుంటున్నాను. అయితే పరీక్షచేసి ఎంతవరకు వీలవుతుందో చూచి చేయాలి గాని తొందరపడితే confusion, mess అయిపోతుందని నా భయం. అలా కాకుండా steady గా అయితే తప్పకుండా చేయాలని నా అభిప్రాయం. అందుచేత ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా చేస్తాం. కొన్నిసమస్యలు ఈ విధంగా పరిష్కారం అవడం నాకు సంతోషం. రిపోర్టుచూచే అవకాశం లేకుండాపోయింది. నేను Prohibition, విశ్వవిద్యాలయాలమధ్య sandwich అయిపోయాను. అదికాక యీ కమిటీసభ్యులు సావకాశంగా పరిశీలించి ఏకగ్రీవంగా యిచ్చిన రిపోర్టు మంచిదిగానేవుంటుందనుకొని యీ రిపోర్టు త్వరగా చూడలేదు. పోతే బాగా ఆలోచనచేసి యీ రిపోర్టుమీద statement యివ్వాలికాని వృథాగా statement యిస్తే విలువ వుండదనుకుంటాను. ఇది నా సొంత అభిప్రాయం అని

[The Hon. Sri S. B. P. Pattabhirama Rao] [1st June 1954

మనవిచేస్తున్నాను. సర్వసామాన్యంగా ప్రజలందరకు యీ Elementary education పెద్ద పునాది చాలా important item

Sri B. Krishnamurthi Rao — Directive principles ప్రకారం 1960 సంవత్సరంలో ఆంధ్రదేశమంతా విద్యావంతులుగా చేయడానికి పూనుకోవాలి కనుక యీ కమిటీసూచనలను పరిశీలనచేసి ఏవిధంగాచేస్తే ప్రయోగం వుంటుందో చూసి చర్య తీసుకోవలసి వుంటుంది. ముఖ్యంగా రాజగోపాలాచారిగారుచెప్పిన పెద్దసమస్య విషయంలో మిగలమంత్రివర్గంతో ఆలోచించినప్పుడే సాధ్యం అవుతుందనుకుంటాను.

The Hon. S B P. Pattabhirama Rao — అది సాధ్యంకాదు ఏలాగైనప్పటికీ ఇప్పుడు నడుస్తూవున్న విద్యావిధానంమాత్రం నడవదు నేను చెప్పినది సరిపోయిందని అనుకుంటున్నాను ప్రభుత్వం పరిశీలనచేసి నిర్ణయానికిరానిదే చెప్పడం సరిగా ఉండదు అని మనవిచేస్తున్నాను.

## GOVT. BILLS

# SRI VENKATESWARA UNIVERSITY BILL

(CONTD.)

## CLAUSE 15

### Class III other Members (contd.)

Deputy Speaker .— ఇప్పుడు శ్రీవెంకటేశ్వరా యూనివర్శిటీబిల్లు Clause 15 లోని Class III కి సంబంధించిన చర్చ ప్రారంభిద్దాము.

The Hon S. B. P. Pattabhirama Raa — నిన్న దీనిని move చేశాను. చర్చకూడా పూర్తి అయింది. నిన్న దానివిషయంలో సమగ్రంగా చర్చచేశారు. గౌరవనీయులైన సభ్యులందరూ కొన్ని సూచనలుచేశారు. ఐతే class III విషయం Select Committee stage లో జాగ్రతగా పరీక్షచేయబడిందని మనవి చేస్తున్నాను. దాన్ని గురించి ఏవిధంగా చెయ్యాలని చర్చచేసి కొన్ని clause లు మార్పుచేశాం. Persons elected by the registered graduates యొక్క సంఖ్యను 10 నుంచి 12 వరకూ పెంచాము. Legislative Assembly సభ్యులలో నుంచి ఎన్నుకోనబడవలసిన వారి సంఖ్య రెండునుంచి మూడుకుపెంచాం. Item 4 (a) ను సవరించి రాష్ట్రంలోని స్థానిక సంస్థలన్నిటికీ సంబంధించేటట్లుకూడా మార్పుచేశాం. Donors విషయంలో 25 వేలు ఇచ్చే associations ను మాత్రం ఉంచి 10 వేలలోపు ఇచ్చే Donors తీసివేశాము Item clause 7B ని complete గా తీసివేయుటకు ఒప్పుకుంటున్నాను. Item 8 ని గురించి చర్చ లేదనుకుంటాను. మొత్తంమీద చర్చ తీవ్రంగా జరిగింది. ఈ విశ్వవిద్యాలయానికి అన్ని వర్గముల తరఫునా representation ఉంటుంది. అదిఉంచిదే అని మనవిచేస్తున్నాను.

ఆర్థిక మంత్రిగారు సెలవిచ్చినట్లు కృష్ణారావుగారు వీటిన్ని seriousగా తీసుకుంటారు అయితే అన్ని విషయాలు ఇక్కడ discuss చేశాం. ఎన్నికలు దుర్వినియోగమవుతూ ఉన్నాయని చెబుతున్నారు. ఇది అన్నింటిలోనూ ఉన్నదికాని, ఇక్కడ registered graduates లో కొంత దుర్వినియోగం అవుతోందని Academic Council, Syndicate మార్పులు చేసుకుంటామని అనుకుంటున్నాను. ఆంధ్ర విశ్వవిద్యాలయం కొన్ని మార్పులుచేసింది Rules ఈ సూచనలతో వదలిపెట్టడం మంచిదనుకొంటాను. Donors విషయంలో 25 వేలు ఇచ్చినవారుకూడా అవసరంలేదని అన్నారు. Life Member గా ఉన్నంతమాత్రాన విశ్వవిద్యాలయం shape మార్చుటకు వీలులేదు. వీరు ఉండడం విశ్వవిద్యాలయానికే మంచిది. అటువంటి donors విశ్వవిద్యాలయం ఏవిధంగానూ influence చేయుటకు వీలుండదు. పూర్వం జమీందార్లుకూడా మెంబర్లుగా ఉండేవారు. వారుకూడా ఏమీ influence చేయలేకపోయారు. రాయలసీమలో అల్లా జరగదు. ఆంధ్రవిశ్వవిద్యాలయానికి ఎనిమిది సార్లు election ఐనది. ఒక్కసారికూడా influence చేయుటకు అవకాశంలేదు. అలాగాక ముందు కట్టుదిట్టములుచేయాలనుకోవడం మంచిది. కాని గత అనుభవాన్ని బట్టి అలాంటిదానికి అవకాశంలేదు. మూడువేలు ఇచ్చినవారు తక్కువసొమ్ము ఇచ్చి మెంబర్లవు తున్నారంటే అది తీసివేస్తున్నాను. తక్కినది విశ్వవిద్యాలయానికే లాభం. 25 వేలు ఇస్తే life member ఐతే నష్టంఏమిటి? అటువంటివారు ఏమి influence చేయలేరు. ఇటువంటి నిబంధన ఆంధ్రవిశ్వవిద్యాలయంలోను మదరాసు విశ్వవిద్యాలయంలోనూకూడా ఉన్నది. తక్కిన విషయాలలో dispute లేదు. ఏకగ్రీవంగా ఆమోదించి దీనిని pass చేయమని కోరుతున్నాను. Nomination విషయంలో అనుమానం raise చేశారు. Chancellor ఇష్టంవచ్చినట్లు చేస్తారని అన్నారు. ఆ అనుమానం కల్గడం ఆశ్చర్యం. కాని chancellor కు ఏమి powers ఇచ్చామో ఒక్కసారిచూస్తే తెలుస్తుంది. 10(2) లో ఈవిధంగా యున్నది.

> "Where power is conferred upon the Chancellor to nominate persons to any Authorities, he shall, to the extent necessary, nominate persons to represent interests not otherwise adequately represented".

స్త్రీలు ఎక్కువమందిలేరు. కాబట్టి వారు represent కావడానికి అవకాశం ఉండాలి. అందువల్ల ఈ clause వేశాం.

అంతేగాక తిరుమల దేవస్థానం 2½ లక్షలు ఇస్తోంది. దేవస్థానం కమిటీలో పట్టుబట్టి కొంతడబ్బు హెచ్చుచేయించుటకు అవకాశం ఉంటుంది. అందువల్ల

> "Ten persons nominated by the Chancellor of whom two shall represent the Tirumalai-Tirupathi Devasthanam."

అని ఉండాలని అనుకొన్నాను.

[Sir S. B. P. Pattabhirama Rao] [1st June 1954

One shall represent the Andhra Chamber of Commerce అని అన్నారు. అందువల్ల అదికూడా ఏర్పాటుచేశాం. ఈవిధంగా చూసుకుంటే నష్టంలేదు. ఒక మహాపండితుడు ఉండవచ్చును. మన ఆస్థానకవిగారు ఉన్నారనుకోండి ఆయనను ఎన్నికలద్వారా రప్పించడం కష్టం. అట్లాంటి పండితులను nominate చేయుటకు అధికారము. Chancellor కు ఉండడం అవసరం. ఇదేవిధంగా varied interests ఉన్నాయి. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో Sir C V Raman మెంబరుగాయున్నారు. ఆయన ఉండుటవల్ల విశ్వవిద్యాలయానికే లాభించింది అందువల్ల కొంతమంది విద్యార్థులును, ప్రవీణులును Senate లో చేర్చుకోవడం మంచిది.

Deputy Speaker — In view of the Hon. Minister's statement are you still pressing your amendment ?

N. Sivarami Reddi .— Yes, Sir.

Deputy Speaker : The question is :—

"In entry No. (3), for the word 'three', substitute the word 'five'."

The motion was lost.

Deputy Speaker :— The question is :

"In entry No. (6), as renumbered, for the word 'ten' substitute the word 'three'."

The motion was lost.

Deputy Speaker :— The question is :—

" (i) In item No. (3) for the words 'two persons', substitute the words 'four persons'.

(ii) Delete item No. (7) as re-numbered.

(iii) After item No. (8) as re-numbered, add the following new item (9) :-

'Four students, studying in post-graduate courses, elected by the University students'.

(iv) After the item No. (9) as re-numbered, add the following new item :

"(10.) One person to be elected by the members of the Panchayat Boards in each district in the State of Andhra'."

The motion was lost.

Deputy Speaker :— The next amendment is that of Sri C. V. K. Rao. " In Class III-Other members-delete items 6 and 7."

అలాంటి power లేకపోతే నష్టం ఉంటుంది. అట్లా ఉంచడం విశ్వవిద్యాలయానికి బాధ-మని మనవిచేస్తూ clause as it is pass చేయమని కోరుతున్నాము.

Sri C V. K Rao — నేను amendment ను withdraw చేసుకోవడంలేదు.

Deputy Speaker — ఆ విధంగా చూచినట్లయితే items (6) and (7) అని వున్నది. ఐతే యిప్పుడు జరిగిన voting తప్పంటారా?

Sri C. V K. Rao — నేను division కోరాను. నా amendment అంగీకరించాలి.

The Hon Sri T Viswanatham :— Objection అప్పుడే చెప్పవలసింది. item (7) pass అయిపోయింది. అందువల్ల మీ సవరణ withdraw అయినట్లే.

Sri T Nagi Reddi — ముందు amendments vote కు పెట్టి, తరువాత item vote కు పెట్టుదాం. అప్పుడుగాని items pass అయినట్లుగాదు

Deputy Speaker ·— Select Committee లో, యీ items అన్నీ re-numbering అయినవి. అందుచేత మీ C V K. రావుగారి amendment item 8 క్రింది వస్తుంది. 9 క్రిందకురాదు.

Sri C V K. Rao — ఆ item లోనే 25000 వేలు యిచ్చేవారిని admit చేశారు. 10 వేలవారిని వదలిపెట్టారు వ్యతిరేకిస్తున్నాను. I am opposed to nomination and so I press for a division.

(When the division bell was ringing, Sri K. Varadachari entered the Chamber with a walking stick in his hand).

Sri K. Krishna Rao :— Are sticks and walking sticks allowed inside the Chamber? (Laughter).

Sri R. Siddanna Goud :— Old men may be allowed and may be exempted.

Deputy Speaker :— Old men are exempted.

Sri K. Krishna Rao :— Even Mr. C. Rajagopalachari, an old man, was not allowed to bring a stick. Otherwise everybody will bring a stick.

Deputy Speaker :— I will now put Mr. C. V. K. Rao's amendment to the vote of the House.

Sri C. V. K. Rao :— అసలు Original Bill లో items (6) (7) ఈ విధంగా వున్నాయి.

(6) Two persons nominated by the Vice-Chancellor from among the Heads of Departments in the University Colleges who are not professors. (7) Ten persons nominated by the Chancellor of whom two shall represent the Tirumalai-Tirupati Devasthanams.

ఈ కండిషన్ omit చేయమని కోరుతున్నాను.

Deputy Speaker — ఇప్పుడు House లో discuss చేస్తున్నటువంటి బిల్లు Select Committee చేత ఆమోదింపబడినటువంటిబిల్లు ఎప్పుడైతే Select Committee చేత ఆమోదింపబడిన బిల్లువచ్చిందో, అప్పుడు Original Bill lapse అయిపోతుంది. కనుక Select Committee లో re-number నే తీసుకోవాలి గాని original bill లోని number తీసుకోవడంజరుగదు. It is not in order.

Sri R. Lakshminarasimham Dora.— Mr C. V. K. Rao has tabled his amendment to the clause as it stood before. In view of the fact that the bill as amended by the select committee is not placed before us, the confusion has arisen.

Deputy Speaker — Time లేకపోవడంచేత, ఈ బిల్లు republish చేయడంలేదు.

Sri C. V. K. Rao — ఇక్కడ nomination అనే principle అనేది సరికాదని, ఇది democratic principle కు విరుద్ధమని, కనుక దీనిని omit చేయమని మంత్రిగారిని కోరినాను వారు దీనిని అంగీకరించవచ్చు. అంగీకరిస్తే ఎవరికి బాధఉండదు.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— ఇదంతా Select Committee stage లో విచారించబడి, ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

Sri T Nagi Reddi :— అధ్యక్షా ! దీనినిగురించి కొందునిమిషాలు మాట్లాడ దలచుకొన్నాను. దీనిని Select Committee stage లో చాలా జాగ్రత్తగా discuss చేశాము. ఈ University Bill pass చేసేటప్పుడు కొన్ని traditions ఉన్నాయి. ఇక్కడ 10 మంది మెంబర్లు Chancellor చేత nominate చేయబడవలెనని ఉన్నది. దీనిని చాలా జాగ్రత్తగా discuss చేసి, వీరిలో non-official Members సంఖ్యను కొంత ఎక్కువచేయడానికి కొన్నిసలహాలు ఇవ్వగా వాటిని ఏకగ్రీవంగా ఆమోదించింది. ఈ సలహాలలో one person elected by the Members of the Municipal Councils అనేది పెట్టినప్పుడు, మొత్తం 11 జిల్లాలకు 11 మందిని increase చేయడం ద్వారాను, అట్లాగానే ఆంధ్ర అసెంబ్లీనుంచి elect అయ్యేటటువంటివారు 2 నుంచి 3 చేయడంద్వారాను non-official Members సంఖ్యను increase చేయడానికి Select Committee లో సూచనలుచేయబడినవి. అది ఏకగ్రీవంగా ఆమోదించబడినవి,

ఇక్కడ 10 మందిని nominate చేయడంలో, అందులో ఒకరిని Andhra Chamber of Commerce నుంచి తీసుకోవాలని కొంత restrict చేయడం జరిగింది. తరువాత nomination విషయంలో కూడ

"Every person making a donation of not less than Rs. 10,000/- but not amounting to Rs. 25,000/- or more"

అనే క్లాసును omit చేశాము. కనుక nominations పద్ధతి తప్పే అయినప్పటికీ, ఇప్పుడు వచ్చినటువంటి యూనివర్శిటీబిల్లును జాగ్రత్తగా పరిశీలించినతరువాత, కొన్నికొన్ని సలహాలు ఇవ్వడం, వాటిని అంగీకరించడంజరిగింది. ఇక్కడ non-officials యొక్క సంఖ్య ఎక్కువ చేయడం జరిగింది. ఇది Select Committee అంగీకరించిందనేవిషయాన్ని సభవారి ముందు పెడుతున్నాను.

Sri V. Chidanandam .— There are so many people from the peons up to the executive officers. So which persons are to be nominated may be clarified.

Sri C. V K. Rao — అధ్యక్షా! non-official members ను ఎంత మందిని nominate చేయాలి అనేవిషయంలో Select Committee లో కొంతమంది సభ్యులు ఇచ్చినటువంటి సలహాలను అంగీకరించినట్లు తెలుపబడినది. Opposition Members కొంతమంది ఆ విధముగా nominations ను అంగీకరించినారు గనుక opposition లో బలములేనిపరిస్థితులలో నేను దీనిని press చేయదలచుకోలేదు.

Deputy Speaker :— The question is :—

In Class II-Other Members-delete items (6) and (7)

The motion was lost.

Sri Pillalamarri Venkateswarlu :— I move :

Delete entry No. (7) (b) as renumbered.

Deputy Speaker:—Sri P. Venkateswarlu గారి amendment accept చేస్తున్నారా?

The Hon. Sri S. B. P. Pattabhirama Rao — I accept the amendment.

Deputy Speaker :— The question is :—

Delete entry No. (7) (b) as renumbered.

The motion was carried.

Deputy Speaker :— The question is :—

That Class III, as amended, do stand part of the Bill.

The motion was carried.

Deputy Speaker — The question is.

That Clause 15 as amended do stand part of the Bill.

The motion was carried.

## CLAUSE 16

The Hon. Sri S. B P Pattabhirama Rao — 16 (1) (*a*) చివర "As in the manner prescribed under this Act." అనేది కూడ చేర్చమని కోరుతున్నాను. ఆప్రకారం ఆ clause అంతా accept చేయమని చెబుతున్నాను.

Sri C. V. K. Rao — I move

"In clause 16, after sub-clause (2), add the following new sub-clause (2) (a):

"(2) (a) The Senate shall constitute a Privileges Committee consisting of not less than eight members of the Senate elected from among themselves to deal with the rights and privileges of the Senate and to deal with matters connected therewith'".

Sri K. Krishna Rao :— I second it.

Sri C. V. K. Rao — ఈ తిరుపతి విశ్వవిద్యాలయమునకు సంబంధించిన యీ బిల్లు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు సంబంధించిన బిల్లుకు సరియైన నకలుగా తయారు చేయబడిందని నేను యింతకుముందే చెప్పాను. అందులోవున్న సంగతులే యీ బిల్లులో దర్శించబడ్డాయి. విరుద్ధతలోకూడా అవన్నీ తూణ్ణంగా ఆలోచించి సరియైన democratic సూత్రాలమీద యీ విద్యాసంస్థను నెలకొల్పటానికి ఎటువంటి ప్రయత్నముకూడా చేయబడలేదు. ఈ బిల్లుకూడా ఆ పాతపద్ధతిలోనే తయారుచేయబడిందిగాని క్రొత్తపద్ధతిలో తీసుకొనిరాబడలేదు. అందులోనివే యిందులో ప్రమోదుచేయబడ్డాయి. ఇందులో చాలా నిరంకుశమైన విధానంతో నామినేటు చేయబడేవారి సంఖ్య ఎక్కువగా వుండటమువల్ల సభ్యులయొక్క అభిప్రాయాలు వారియొక్క యిబ్బందులు తెలుసుకోటానికి ఒక Privileges Committee అయినా democratic సూత్రానుగుణ్యంగా వుండాలనే వుద్దేశ్యముతో నేను యీ సవరణ తెచ్చాను. ఇప్పుడు మన లెజిస్లేచరులో సభ్యులయొక్క హక్కులను కాపాడటానికి ఒక Privileges Committee వున్నది. అదేవిధంగా విశ్వవిద్యాలయమునకు సంబంధించిన యీ సెనెటుమెంబర్లకుకూడా ఒక కమిటీవుంటే బాగుంటుంది. సెనెటు మెంబర్ల హక్కులు ఎట్టి పరిస్థితులలోనైనా భంగము కలిగినప్పుడు అవి కాపాడుకోటానికి మెంబర్లకు ఒక అవకాశముకల్గించటానికి యీ Committee చాలా అవసరము గనుక అటువంటి కమిటీ సృష్టించటానికి నేను యీ సవరణ తెచ్చాను. కాబట్టి యిప్పుడు నేను యీ [illegible] తెచ్చినసవరణను బలపర్చాలని సభ్యులందరికి విజ్ఞప్తిచేస్తున్నాను.

1st June 1954]

Sri K Krishna Rao :— అధ్యక్షా, మద్రాసు యూనివర్శిటీ యాక్టులో యీ సెనేటు నిర్మాణముగురించి ఒక provision వుంది.

The Madras University Act says:—

"The Senate shall be the supreme governing body of the University and shall have power to review the action of the Syndicate and of the Academic Council save where the Syndicate and the Academic Council have acted in acordance with powers conferred on them under this Act, the Statutes, the Ordinances or the Regulations and shall exercise all the powers of the University not otherwise provided for and all powers requisite to give effect to the provisions of this act,

Provided that if any question arises whether the Syndicate or the Academic Council has acted in accordance with such powers as aforesaid or not, the question shall be decided by a resolution passed by two-thirds of the number of members present and voting at a meeting of the Senate and the decision shall be final."

అనేవిధముగా వున్నది. కాని ఆంధ్రయూనివర్శిటీ యాక్టు వచ్చేటప్పటికి యీ provision తీసివేశారు. అందువల్ల Vice-Chancellor యొక్క ఏకచక్రాధిపత్యము జరుగుతున్నవి. అందువల్ల Democratic principle మీద ఒక check అనేది వుంటే మంచిది అని అంటున్నాను. ఇప్పుడు అదేవిధముగా యీ తిరుపతి విశ్వవిద్యాలయానికి సంబంధించిన సెనేటునుగూడా నడపటానికి వీలుగా యీబిల్లు తీసికొని వచ్చారు. కాని మార్పులు యేమీ కన్పించడము లేదు. అందువల్ల Senate Members యొక్క powers ను specific గా define చేయడమునకు యిటువంటి Privileges Committee ఒకటి కనీసము అవసరమని నా అభిప్రాయము. సెనేటు సభ్యులయొక్క హక్కులు ఏవిధంగా వుండవలసినది నిర్ణయించడము చాలా అవసరము అని అంటున్నాను. అసలు ఎసెంబ్లీలో కూడా సభ్యులయొక్క privileges కాపాడటానికి ఒక active Committee పనిచేయడం అత్యవసరం గనుక యిటువంటికమిటీ ఉండవలెనని. నా ఉద్దేశ్యము. అందువల్ల నేను యీ amendment ను బలపరుస్తున్నాను.

The Hon. Sri T. Viswanatham :—శ్రీకృష్ణారావుగారు ఈ యూనివర్శిటీ యాక్టులోని 28 వ క్లాజును ఒకపర్యాయము చదివితే సరిపోతుందని నా మనవి. యూనివర్శిటీకి సంబంధించినంతవరకు సెనేటుసభ్యులకుగాని, సిండికేటుకుగాని పూర్తి అధికారము వుంది. ఏవిషయమైనను పరిష్కరించుకోటానికి వారికి పూర్తి అధికారము వున్నది. వారు యిష్టపడితే ఒకకమిటీని వేసుకోవచ్చు. అటువంటి యిబ్బందులువస్తే అవన్నీ తీర్మానించేసుకోవచ్చు. దానికి ఎవరుకాదనరు Privileges Committee అనేది ఒకటి ప్రత్యేకంగా ఏర్పాటుచేసుకో నవసరములేదు. ఎప్పుడు అవసరమైతే అప్పుడే ఒక కమిటీని

చేసుకోవచ్చు అందులో ఏవిధమైన యిబ్బందివుండదు. ఒక privileges సంగతిమాత్రమే కాదు. ఈ బిల్లులోని 29 వ క్లాజును పరిశీలించి చూడమంటున్నాను. అందులో అన్ని విషయాలు వున్నది సెనేటుకు అన్ని powers వున్నవా కాదా అని అంటున్నారు.

Clause 16 (2) says: "The Senate shall exercise all the powers of the University not otherwise provided for and all powers requisite to give effect to the provisions of this Act."

అందువల్ల ఏ ఏ powers సెనేటుకు అవసరమని అంటున్నారో యీ క్లాజుక్రింద ఆ powers అన్నిగూడా నిర్వహించుకోవచ్చు. అంతేకాకుండా Breach of Privileges అనుకోండి conditions of privileges అనుకోండి యింకా యితర వ్యవహారాలు అనుకోండి. ఆ powers అన్నీగూడా exercise చేసుకోటానికి వారికి అన్నివిధాలా provision వున్నది అందువల్ల యిప్పుడు కృష్ణారావు మరొకసారి ఆలోచించుకొని వారు చెప్పేది విరమించుకొని మిగిలిన కార్యక్రమానికి proceed కావటానికి అవకాశము యివ్వమని కోరుతున్నాను.

Sri K. Krishna Rao.— "The Senate shall exercise all the powers of the University unless otherwise provided for ... ."
అని ఈ బిల్లులో ఉంది. దీనివల్ల సెనేటుసభ్యుల అధికారాలను బలపరచినట్లు అంటూ ఉండదు. కాబట్టి ఒక Privileges Commitee ఉండడం సాధ్యమని నా యభిప్రాయం.

The Hon. Sri T. Viswanatham :— Syndicate కు యిచ్చిన powers, Academic council కు యిచ్చిన powers చాలా restricted గా వున్నప్పటికి ఈ యాక్టులో Senate కు కావలసిన powers అన్నికూడా వున్నవి కాబట్టి యిప్పుడు వేరే clarification అవసరము లేదని మనవిచేస్తున్నాను.

Sri C. V. K. Rao :— అధ్యక్షా, శ్రీ T విశ్వనాథంగారు 29 క్లాజు ప్రకారము ఇటువంటి Committee యేర్పడే గనుక ఈ సవరణ అవసరంలేదని మీరు అంటున్నారు. నేను తీసుకువచ్చిన amendment ప్రత్యేకముగా Privileges Committee కోసమని తీసుకు వచ్చాను. Rights and privileges ను establish చేయడానికిగాను Senate కు ఒక Privileges Committee ని ఏర్పాటుచేయవలసిందని కోరుతున్నాను. ఇది constitutional అనికూడా అంటున్నారు. ఈ వుద్దేశ్యంతో వుంటే, ప్రభుత్వానికి Privileges Committee ని పెట్టడానికి వ్యతిరేకత లేకపోతే senate యొక్క rights and privileges ను కాపాడడానికిగాను ఒక committee ని యేర్పాటుచేయటంలో ప్రభుత్వానికి యిబ్బందిలేదు. కనుక తప్పక మీరు యీ amendment ను అంగీకరించవచ్చు. [illegible] యీ amendment ను తప్పకుండా అంగీకరించవలసినదని నేను కోరుతున్నాను.

1st June 1954]

Sri Vavilala Gopalakrishnaiah — అధ్యక్షా! "All the authorities of the University shall have power to appoint Committees" అనేదాని ప్రకారము Senate చేయవచ్చు. దేనికి? మనం తరచు Special Committees ను, Ad Hoc Committees ను వేస్తున్నాము అలాగునసే, యిక్కడ Privileges Committee అనేది ఒకటి ఫలానాపనికి అని ఒక Standing Committee ని వేశారు. అయితే శ్రీ విశ్వనాథంగారు చెప్పినదానికి, శ్రీ కృష్ణారావు గారు చెప్పినదానికి తేడావుంది. శ్రీ విశ్వనాథంగారు చెప్పిన అన్ని points correct కావు. University లోనైనా Senate యిచ్చిన మెంబర్లనే కమిటీలలో వేసుకోవచ్చు. ఈ కమిటీలు ప్రత్యేకంగా ఒక specific purpose కు గాను యిక్కడ తీసుకొనవచ్చుననేది correct అని నేను అనుకొంటున్నాను. కాని వారుచెప్పేది, ఒక కమిటీ యిక్కడవుండవచ్చు, కాని దానిని constitutional గా తరువాత వేసుకోవచ్చు, అనేది వారి speech లో వున్న భావము. కాని, ఇప్పుడు కమిటీని వేసుకొనవలసిన అవసరమువుంది. కాబట్టి ఒక specific purpose కోసమని వేసుకోవచ్చు. ఈ Privileges Committee అనేది super-body దానిని ప్రత్యేకంగా వేసుకొనవలసిన అవసరంవుందని, శ్రీ విశ్వనాథం గారు చెప్పిన points correct కాదని, సందేహాస్పదంతో వదిలిపెట్టటంవల్ల Senate తన rights and privileges ను establish చేసుకొనజాలదని చెపుతూ, నేను యీ Privileges Committee వుండాలని మనవిచేస్తున్నాను.

Sri G. Yellamanda Reddi :— Sir, I move :

After the sub-clause (r) of sub-clause (1) insert the following new sub-clause :

"(s) to constitute a Committeee of five from among its members with the Vice-Chancellor as the Chairman of Appointment Committee."

అధ్యక్షా! దీని కింత చర్చపెట్టుకోవలసినది యేమీలేదు. Appointments యివ్వడానికి విశ్వవిద్యాలయంలో ఒక కమిటీవుండి, దానికి సభ్యులను Senate యెన్నుకుంటే, యీ appointments విషయంలో కొంతవరకు న్యాయం జరుగుతుంది కాబట్టి, యీ అవకాశం కల్పించడానికి యీ amendment ను బలపరుస్తూన్నాను.

Sri Vavilala Gopalakrishnaiah :— I second it.

The Hon. Sri T. Viswanatham :— అసలు యీ University అనేది ఒక autonomous body గా create చేస్తున్నాం. ఆ విధంగా యిక్కడ create చేసిన తరువాత Senate లో వున్న Members, వారియొక్క rights and privileges ను కాపాడుకొనుటకుగాను, తమకు యే కమిటీని Senate సభ్యులతో యేర్పరచాలనేది ఆ ష్నలే నిర్ణయించుకోవాలి. అందుచేత, యీ కమిటీని వారే నిర్ణయించాలి. అసలు దానికి

[The Hon. Sri T. Viswanatham] [1st June 1954

autonomous powers వున్నవి. కాబట్టి, ఆ right దానికి అప్పుడే వస్తున్నది. కొన్ని supreme powers Senate కు యిచ్చాము. Senate యొక్క rights ను పెంపొందించటంకోసము యేవిధమైన కమిటీని యేర్పరచుకోవాలనే సమస్య వచ్చినట్లయితే, అందుకు సంపూర్ణ అధికారాలు దానికేవున్నాయి అసలు University ని యిక్కడ autonomous body గా create చేస్తున్నాము కాబట్టి, ఆ హక్కు ఆ సభ్యులకే వదలిపెట్టాలని నేను మనవిచేస్తున్నాను.

Sri T. Nagi Reddi :— On a point of information, Sir, ఆ హక్కు Senate కు వున్నది కాబట్టి మనం యిక్కడ regular గా పెట్టినట్లయితే నష్టం యేమిటి ?

The Hon Sri T. Viswanatham :— Senate లో అక్కడ సభ్యులకు వున్న privileges కాపాడడానికిగాను అవసరమైన Privileges Committee వుండాలి అన్నప్పుడు Senate యొక్క powers అన్నీ యిందులో చెప్పబడ్డాయి. Legislators యొక్క privileges ముఖ్యంగా define కాకుండానే, మనకు తెలియనివిషయంపై English Constitution ను refer చేయవలసిన అవసరంవస్తోంది. ఇవి privileges అని ఒకటి స్పష్టపరచుకోవాలి. అలాగే, privileges అనేవి define కాకుండా Senate లో వున్న సభ్యులనే అక్కడ పెడుతున్నామంటే, దానికి గౌరవసభ్యులు యే అర్థంతో అంటున్నారో తెలియటంలేదు. మన Act లో యీ Senate కు వున్న powers అన్నీ define చేశాము. వేరే Privileges Committee అక్కర్లేకుండానే, యీ Act లో Clause 16 (2) క్రింద Senate కు సంపూర్ణమైన అధికారంవుంది. మాకు యీ అధికారం వుందా, లేదా, అని వారు సందేహపడ నక్కర్లేదు. వారికి కావలసి వచ్చినప్పుడు, ఒక కమిటీని వేసుకోనేందుకు సంపూర్ణమైన అధికారంవారికి ఉన్నది Senate autonomous body కాబట్టి, ప్రతి University Act లో కూడ ఈ అధికారం వారికి వుంటుంది.

Sri T. Nagi Reddi :— Senate కు ఏయే అధికారాలు వున్నవి మనం యిక్కడ define చేశామన్నారు. అది నిజమే. కాని, Senate లో వున్న సభ్యుల యొక్క rights and privileges ను curtail చేయటం అనేది కొన్ని కొన్ని సమయాల్లో జరిగిందనే విషయం మరచిపోకూడదు. ఏమైన మన ఆంధ్రా యూనివర్సిటీ సెనేటులో కొన్నికొన్ని జరిగినవి. బ్రహ్మాండమైన విద్యావేత్త C. R. Reddi అటువంటి personalities అక్కడ కూర్చున్నారంటే, మనం పంపిన ప్రశ్నకు సమాధానంరాదు. దానిమీద supplementary questions వేయ వీలులేదు. ఆయన వీటిపై యిచ్చిన rulings అన్నీ print చేయించి, వాటిని సభ్యులకు పంపించి పెట్టేవాడు. ఆ విధంగా అక్కడ జరిగేది. తరువాత Dr. V. S. Krishna గారు Vice-Chancellor గా వచ్చిన [illegible] అధికారాలు కొంచెము widen చేయబడ్డాయి, Senate కు వుండ.

1st June 1954 [Sri T. Nagi Reddi]

వలసిన powers నిర్ణయిస్తున్నామంటే, Senate కు వారి చేతుల్లో వున్నాయో నేను చూస్తూనేవున్నాను. నేను ఆ ప్రశ్నకు సమాధానమేమిటని నేను అడగడానికి వీలులేదు. అడగడానికి హక్కులేదు. Over-riding powers అంటే dictatorship వారికి యిచ్చాము. దీని C. R. రెడ్డిగారు exercise చేసేవారు. అంటే, వారు మంచికే exercise చేసేవారు University ని develop చేయడానికి అంతపెద్ద powerful personality వుండి నోటికి తాళంవేసేవారు It is a known thing to all. అటువంటప్పుడు, Senate members యొక్క rights and privileges ను safeguard చేయడానికి ఒకవిధమైన provision యెంతో అవసరమని నేను అనుకొంటు న్నాను. ఇవన్నీ ఆలోచించకుండానే, మేము యీ provision పెట్టమనటంలేదు. అందు చేత, అటువంటి పరిస్థితులలో ఒక Privileges Committee అంటూవుంటే అది వుప యోగపడుతుంది అందుచేత, దీనిని అందరూ అంగీకరిస్తే బాగుంటుందని నేను విశ్వసిస్తున్నాను.

The Hon Sri S. B. P Pattabhirama Rao — ఉపాధ్యక్షా! ఇప్పుడు ప్రివిలేజస్ కమిటీ ఒకటి పెట్టమని ఒకసూచన వచ్చింది. కట్టమంచి రామలింగారెడ్డిగారు నోటిని తాళంవేసి విశ్వవిద్యాలయాన్ని నడిపారనికూడా అన్నారు చివరికి ఏమిచేసినప్పటికీ మంచికే చేశారు అనికూడా అన్నారు. దాని విషయం మనం చర్చించవలసిన అవసరం లేదు. ఒకవేళ ప్రివిలేజెస్ కమిటీ కావలిస్తేదాన్ని ఏర్పాటుచేయ్యడం కష్టంకాదు "To constitute a Committee of five from among its Members with the Vice-Chancellor as the Chairman of Appointment Committee." అని శ్రీ G. Yellamanda Reddi గారు చెప్పారు. నిజంగా ఇది చేస్తే విశ్వవిద్యాలయానికి అపకారంచేసినవాళ్లం అవుతాం. దానికి ఒక Selection Committee ని కూడా వేశాం. clause 36 తమరు తిరగవేసి చూస్తే దానిలో ఏమికుందో తెలుస్తుంది.

Clause 36: Constitution of a Selection Committee.

There shall be constituted a Selection Committee which shall consist of the following persons, namely:—

(1) The Vice-Chancellor who shall ex-officio be the Chairman of the Committee.

(2) The Director of Public Instruction or a senior official of the Education Department to be deputed by him to act in his place during his absence.

(3) The Chairman of the Honours Board of Studies concerned.

(4) Two persons nominated by the Syndicate (not being members of that body). for each appointment or class of appointments.

(5) The Principal of the University Colleges.

[Sri S. B. P. Pattabhirama Rao] [1st June 1954

ఇది పూర్తిగా academic మెంబర్సుతో సంబంధం ఉన్నదే. తక్కిన ఇద్దరు Members ను పెద్దవాళ్లనే నుంచివేసుకుంటారు. నాకు తెలిసినంతవరకు ఈ ఆంధ్రయూనివర్శిటీలో సర్ సి వి. రామన్, డాక్టర్ రాధాకృష్ణ మొదలైనవాళ్లను వేస్తారు. చాలావరకు దానిలో academic people నే వేస్తారుకాని మిగతావాళ్లను వేయరు. అలాకాకుండా ఒక్క సెనేట్ లోనుంచే అయిదుగురు member లను ఎన్నుకోవాలంటే అది academic standard కు సరిపోదని, ఇతర యూనివర్శిటీల standard కి సరిగాఉండదని చెపుతున్నాను. Academic standard కు భంగంవచ్చేవిధంగా చేయవద్దని చెప్తున్నాను. అలాకాకుండా సెనేట్ లోనుంచి స్థానం కావాలని అంటే ఒక మెంబర్ను తీసుకోడానికి ఒప్పుకుంటున్నాను. అలా ఇవ్వండి మీరుకాదూ కూడదంటే మీ ఇష్టంవచ్చినట్లు చేయవచ్చు. ఇంక దానియొక్క standard ను భగవంతుడే రక్షించాలి.

Sri Pillalamarri Venkateswarlu — శ్రీ పట్టాభిరామారావుగారు standard కూడా నిలబెట్టికూడానికే ఇక్కడ ఉన్నట్లు మాట్లాడారు. సెనేట్ నుంచి కూడా కొంత representation ఎలాగా ఉంటుందనే ఉద్దేశంతో amendment ఇచ్చాం. కాని వారు ఒకర్ని ఎన్నుకోమని చెప్పారు. ప్రతిదఫా అపాయింట్మెంట్ వచ్చినప్పుడల్లా వోట్ కావలసి వస్తుందేమో అని చెప్పారు. కాని వారు raise చేసిన చిక్కు ఏవిధంగాను రాదు. కాబట్టి సెనేట్ లోనుంచికూడా ఎన్నుకోడం మంచిదని దాన్ని తీసుకువచ్చాం. దానిలో ఇప్పుడు మునిగిపోయే ప్రమాదం ఏమీలేదు. వాళ్లతోబాటు ఇద్దరు సెనేట్ సభ్యులుకూడా ఉండాలని చెపుతున్నాను. ఇందులో Director of Public Instruction ని తీసుకున్నారు. వీరు ఏ College Principal గా అయినా ఉండదగిన వ్యక్తి.

The Hon Sri S. B. P Pattabhirama Rao — మన Director of Public Instruction అందుకు తగినవారే. ఆయన చాలా అనుభవం ఉన్నవారే ?

Sri Pillalamarri Venkateswarlu — అయితే సరే! అందువల్ల సెనేట్ నుంచి కనీసం ఇద్దరిని తీసుకుంటే బాగుంటుందని చెపుతున్నాను.

Sri T. Nagi Reddi :— స్టాండర్డ్సు తగ్గించడానికి అది ఉపయోగపడుతుందనే భయం చూపిస్తున్నారు. సెనేట్ అనేది ఒక supreme body అని గుర్తించబడుతున్నది అటువంటివాళ్లు అక్కడకు వచ్చినప్పుడు వాళ్లు విశ్వవిద్యాలయంయొక్క అభివృద్ధికి తోడ్పడతారనే అనుకుంటున్నాం.

"The Syndicate is the executive body of the whole University." అక్కడఉండే ఆరుమందిలో ఇద్దర్ని పంపుతున్నాం అంటే దీనివల్ల అంత ఇబ్బందిరాదు. మంత్రిగారు ఒకరు అన్నారు. మేము ఇద్దరం అంటున్నాం. ఆ clause వచ్చినప్పుడు మా అభిప్రాయంమీద, మంత్రిగారి అభిప్రాయంమీద ఓటు తీసుకోవచ్చు.

The Senate shall constitute a Privileges Committee consisting of not less than eight members of the Senate elected from among

themselves to deal with the rights and privileges of the Senate and to deal with matters connected therewith.

The Senate shall constitute a Privileges Committee అనే amendment ను తీసుకొంటున్నాను అన్నారు. అసలు Clause 16 కు amendments ఉన్నపుడు clause 36 కు కూడా ఆ amendments ఉండాలి [illegible] ఇంచుమించు clause 16, clause 36 రెండూ ఒకటే అందుచేత ఏకంగా 36 clause వచ్చినప్పుడే ఈ amendments మీద discuss సి నిర్ణయించడానికిగాను ఈ 16 clause ను discuss చేయడానికి 36 వ క్లాజ్ చర్చకు [illegible] చేయాలని కోరుతున్నాను

Deputy Speaker — ఈ 16 కు ఉన్న amendment ను postpone చేయాలంటారా ?

Sri T. Nagi Reddi — ఇప్పుడే decide చేస్తే సరిపోతుంది.

The Hon Sri T Viswanatham — "The rights and privileges of Senate కు బదులుగా 'Members of the Senate' అనేటటువంటిది separate గా పెట్టినంటే ఆ interpretation బాగా ఉంటుందని నేను మనవిచేస్తున్నాను.

Sri C. V. K. Rao :— ఇచ్చట ఉన్నదానికి interpretation లు అవసరం లేదనుకుంటాను. Senate చేసినతీర్మానాలకిగాని Senate లో ఇంక ఏ ఇతరమైన హక్కులకు గాని భంగకరమయేటట్లయితే ఈ Privileges Committee దానిని విచారిస్తుంది మన శాసనసభకు Privileges Committee ఎలాగుంటుందో అదేవిధంగా Senate కు ఇది ఉంటుంది. Senate యొక్క privileges కు rights కు భంగం కల్గకుండా చూచుట ఈ కమిటీయొక్క పని. అందుచేత ఇది చాలా అవసరమని నేను ఈసవరణను ఇచ్చాను.

Sri Vavilala Gopalakrishnaiah .— విశ్వనాథంగారు చెప్పినట్లు 'Privileges of the Senate' అనేకంటే 'Members of the Senate' అంటే సరిపోతుంది అనుకుంటాను.

Deputy Speaker :—I shall now put the amendment of Sri **C. V. K.** Rao to the vote of the House. The question is:

In clause 16, after sub-clause (2), add the following new sub-clause (2) *(a)*:

> "(2) *(a)* The Senate shall constitute a Privileges Committee consisting of not less than eight members of the Senate elected from among themselves to deal with the rights and privileges of the Senate and to deal with matters connected therewith."

The amendment was declared lost. Sri C. V. K. Rao pressed for a division, and the House divided thus:

AYES

1 Sri G Suryanarayana
2 ,, S Vemiah
3 ,, K Krishna Rao
4 ,, Vavilala Gopalakrishnaiah
5 ,, G. C Kondiah
6 ,, T Lakshminarayana Reddi
7. ,, B Gangayya Naidu
8 ,, M Kunne Rao
9 ,, G Nageswara Rao
10 ,, P Narasimha Reddi
11 ,, P Bapu Naidu
12 ,, R Venkatajagga Rao
13 ,, P Syamasundara Rao
14 ,, C Prabhakara Chowdary
15. ,, Kavali Narayana
16. ,, S. Kasi Reddi
17 ,, K Ranga Rao
18 ,, C Pulla Reddi
19 ,, G Bapanayya
20. ,, C V K Rao
21 ,, K. Rajagopala Rao
22. ,, D Seetharamaiah
23 ,, T Potha Raju
24. ,, P. Venkatasiviah
25 Sri Saka Venkata Rao
26 ,, B Sankarayya
27 ,, G Rama Rao
28 ,, P S Ramachandra Rao
29 ,, K Subba Reddi
30 ,, G Anjaneyulu
31 ,, G Joseph
32. , K Malakondayya
33 ,, T Nagi Reddi
34 ,, Pillalamarri Venkateswarlu
35 ,, M Hanumantha Rao
36 ,, K Venkaiah
37 ,, M Veerabhadram
38 ,, G Satyanarayana
39. ,, K Govinda Rao
40. ,, G Yellamanda Reddi
41. ,, V. Sri Krishna
42 ,, Chandra Ramalingaiah
43. ,, N Sivarami Reddi
44. ,, A. Venkataramaraju
45 ,, V Rama Rao
46 ,, B Lakshminarasa Raju
47 ,, P Rama Rao

Ayes: 47

NOES

1. The Hon Sri N Sanjeeva Reddi
2. ,, K Koti Reddi
3. ,, T Viswanatham
4. ,, D Sanjivayya [Rao
5. ,, S B P Pattabhirama
6. ,, P. Thimma Reddi
7. Sri V. C. Chudamani Deo
8. ,, P. Sangamnaidu
9. ,, H Ramalinga Reddi
10. ,, P. Satyanarayana Reddi
11. ,, K. Adikesavalu Naidu
12. ,, D. Ramabrahmam
13. ,, T. C Atchannaidu
14. ,, P. Venkatasubbayya
15. ,, K Shanmugam
16. ,, T. Mallayya
17. ,, Ch. S. R V. P. Murthy Raju
18. ,, K Venkatanarayana Dora
19. ,, K. Chenchurama Naidu
20. ,, G. Sivasankara Reddi
21 Sri S Narayanappa
22 ,, K Santhappa
23. ,, Ch Indrayya
24 ,, Thota Ramaswamy
25 ,, R. B V Sudarsana Varma
26. ,, M Doraikannu
27 ,, P Gunnaya
28 ,, Srungaram
29. ,, K. Veeranna Padal
30. ,, Pragada Kotaiah
31 ,, Y V Krishna Rao
32. ,, K. Ramiah
33 ,, K Ramamurthy
34 ,, Bhojja Appalaswamy
35 ,, K. Bapanna Dora
36. ,, K. Ramaiah Chowdari
37. ,, K Appala Naidu
38. ,, V. Chidanandam

Noes: 38

**The amendment was carried.**

1st June 1954]

The Hon Sri T. Viswanatham — ఈ amendment accept చేయడంవల్ల consequential గా ఈ clause 2 లో Senate కు ఉన్న privileges కు, powers ను restrict చేసినట్లవుతుంది.

Sri T Nagi Reddi — శాసనసభకు సంబంధించి ఒక Privileges Committee ని వేసినట్లయితే Assembly powers అన్నీ restrict చేయడం అవుతుంది అనేటటువంటివిధానం శాసనసభా సాంప్రదాయం కాదు. అదేవిధంగా Senate కు సంబంధించి, ఒక Privileges Committee వేసినంతమాత్రాన, Senate యొక్క అధికారాలు తగ్గవు. అసలు privileges కమిటీ ఉండడం చాలా అవసరం. ఏ clause తీసివేసినా, ఏ clause ను తీయకపోయినా ఈ clause తప్పక ఉండవలసినది. Legislative body కి మంత్రివర్గం executive body గా ఉన్నట్లు University కి Senate అనేది executive body గా ఉంటుంది. ఈ Senate యొక్క powers ను మనం కుంచించడంలేదు.

Let him not put it as a lawyer that we are restricting the powers of the Senate by the acceptance of this amendment. It is a very sane clause, sanely adopted and will be sanely put in action.

The Hon Sri T. Viswanatham — Senate కు యిదివరకే powers వున్నాయి. అందుచేత privileges కమిటీ అక్కరలేదన్నాను. Legislative question constitution చదివితే తెలుస్తుంది. మన privileges undefined అందుచేత Privileges Committee ని వేసుకున్నాం. కాని Senate powers పూర్తిగా define కాబడినవి. అందుచేత అక్కరలేదన్నాను. కాదు, మీరు కావాలన్నారు. నెగ్గింది సంతృప్తి వుండవచ్చు.

Sri T. Nagi Reddi :—I am really surprised at the manner in which the Hon. Minister has given the reasons against the adoption of this amendment. I would like to ask him how the powers of this House are restricted by having a Privileges Committee of its own. I would like to say that this sub-clause will not in any way restrict the powers of the Senate.

Clause 16 as amended was put and carried.

## CLAUSE 17

Clause 17 put and carried.

## CLAUSE 18

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— I move clause 18 as come out from the Select Committee.

Deputy Speaker .— There are three amendments of Sri C.V.K. Rao under Class II - Other Members. He will move his amendments.

Sri C. V. K. Rao — Sir, I beg to move

"That in clause 18, Class II - Other Members, item (1), for the word 'three', substitute the word 'six', and in item (3), for the word 'three' substitute the word 'two'.

Add the following proviso after item (3)

Provided that no salaried teacher of the University either in his capacity as member of the Senate, or academic Council, or both, shall take part in, or vote, at the elections conducted to the Syndicate and to the executive posts of officers of the University, as defined in clause. 9."

The amendments are self-explanatory.

Sri K. Krishna Rao — I second it.

Sri N. Sivarami Reddi — Sir, I beg to move "that in class II other members" item (1) for the word 'three,' substitute the word 'Five,' and detele item (3) ఈనాడు ఛాన్సలరుకు సిండికేటుకు ముగ్గురు సభ్యులను nominate చేసే అధికారం అనవసరం ఏవైనా specific interest కు ప్రాతినిధ్యం ఇవ్వదలచినట్లయితే nomination కు అవసరం ఉంటుందేమో కాని ఇతర సందర్భాలలో అటువంటి అవసరం కనపడదు. 19 ఎ క్లాజు క్రింద సిండికేటుకు విశేషాధికారాలు వున్నాయి. సెనేటుకు ఎంత అధికారం ఉన్నదో సిండికేటుకుకూడా అంత అధికారం ఉన్నది. సెనేటుచేసిన తీర్మానాలను సిండికేటు క్రమంగా అమలు జరపాలంటే సిండికేటులో సెనేటునుంచి ఎన్నికైన అయిదుగురు సభ్యులుండడం ప్రజాస్వామ్య సూత్రాలకు అనకూలాగా వుంటుందనే అభిప్రాయంతో ఈ సవరణ ఇచ్చాను. దానిని అంగీకరించాలని నా కోరిక.

The amendment was duly seconded.

Sri K. Krishna Rao — C V. K. రావుగారు చెప్పినట్లు teacher లు, proffossor లు senate లో వుండి ఎలెక్షనులలో పాల్గొవడంవల్ల వారు పై అధికారులు చెప్పినట్లు vote చేయడానికి అందుకు అనకూలంగా వున్నటువంటి మనుష్యులను సిండికేటుకు తీసుకురావడానికి అవకాశం వున్నది. దానికి అవకాశం యివ్వకూడదని నేను చెబుతున్నాను. High academic standards ను మన యూనివర్శిటీ ఏవిధంగానూ create చేయలేదని చెప్పవలసినదే. ఒకవిధంగా చాదస్తులను తయారుచేస్తున్నది. సెనేటుమెంబరుగా అనుభవంగల C. V. K. Rao గారు సూచించారంటే యీ amendment చాలప్రధానమైనది. Academic standards ను అభివృద్ధిచేయడం University ఆదర్శం. Academic greatness అనేటటువంటి స్థాను పట్టాభిరామారావుగారు వదలిపెట్టేశారు.

1st June 1954]

5. "(1) No person shall be excluded from membership of any of the University or from admission to any degree or course of study on the sole ground of sex, race, 1 (creed, class, or political views) and it shall not be lawful for the University to adopt or impose on any person any test, whatsoever relating to religious belief or profession or political views) in order to entitle him to be admitted thereto as a teacher or student or to hold any office therein or to graduate thereat or to enjoy or to exercise any privileges there except where in respect of any particular benefication accepted by the University such test is made a condition thereof." అని ఉంది

ఇదే section అన్నామలై యూనివర్శిటీ చట్టంలో ఉన్నది ఈ రోజున ఇది చాలా అవసరం యూనివర్శిటీ కళాశాలలో కొన్నికొన్నిచోట్ల, అమెరికాలోకూడా, కమ్యూనిస్టు పార్టీలో లేవని certificate ఇవ్వకపోతే తీసివేస్తున్నారు. నేను Students Federation సభ్యుడను కాదంటేనే గాని admit చేసుకోనటువంటి anti communist phobia అమలు జరుగుతోంది. ఇది కేవలం ఛాందసం. బానిసభావాలను inculcate చేయడం జరుగుతూఉంది. ఇంకా బానిస condition హిందూదేశంలో యున్నది పై అధికారి ఏమనుకుంటాడో అనే అనుమానం ఉండి సభ్యుల్ని తమ వ్యక్తిత్వాన్ని, స్వకీయాభిప్రాయాలను ఒత్తిడికి తట్టుకోలేక వదలిపెట్టే పరిస్థితులకు ఎంతమాత్రం అవకాశమీయరాదు.

The Hon. Sri S B. P Pattabhirama Rao — అధ్యక్షా! ఇప్పుడు చెప్పినవిషయాలు విన్నాను. శివరామిరెడ్డిగారి న్యాయంగానే సందేహంకల్గింది. ఈ సందేహాన్ని నివృత్తిచేయడం అవసరం. ఈ క్లాజువిషయంలో Select Committee లో కొన్ని మార్పులు జరిగాయి. ఆంధ్రప్రభుత్వ ఆర్థికశాఖ కార్యదర్శిగారినికూడా ex-officio member గా చేయవలెననే మార్పు ఒకటి. ఛాన్సలర్ nominate చేయవలసిన వారి సంఖ్య 3 నుంచి 2 కు తగ్గించవలెననే మార్పుకూడా చేయబడినది. ఇది రెండవసవరణ. అంతేగాక "Provided that no employee of the University other than the principal of the University Colleges shall be a member of the Syndicate" అనే proviso ను కూడా చేర్చుకున్నారు. దీనినిబట్టి యూనివర్శిటీ కేంద్రంలోఉన్న professors లు, ఇతరులు సిండికేటుసభ్యులుగా ఉండుటకు వీలులేదు. యూనివర్శిటీ professors మాత్రం ఉండకూడదనే నిబంధనను పాటిస్తూవచ్చాం. ఈ విషయంలో C. R. రెడ్డిగారిక్కూడా strong views ఉండేవి. అందువల్ల ఈ proviso చేర్చాం. అందులో 'two persons' అని వేశాము. మొత్తం 12 ఉంటే body compact గా ఉంటుంది. అది ఎక్కువచేస్తే బాగుంటుందన్నారు. 'Four persons' చేయుటకు ఒప్పుకుంటాను. అంతకంటే composition ఎక్కువచేస్తే, రాజగోపాలచారిగారి గవర్నమెంటులో 12 మంది మంత్రులంటే మీరంతా ఆక్షేపించారే, అట్లాగే ఉంటుంది. Executive body ఎంత compact గా ఉంటే అంతమంచిది. ఆ ప్రకారం నడిపిస్తే

విశ్వవిద్యాలయం శ్రేయస్సుకు పాటుపడినట్లు అవుతుంది. ఆప్రకారం ఏర్పాటుచేయుటకు అంగీకరించి amendment ను withdraw చేయమని కోరుతున్నాను.

Sri Pillalamarri Venkateswarlu — Amendment అభ్యంతరం లేదు. అని మంత్రిగారన్నారు. సంఖ్యను మూడునుండి నాలుగు చేయడానికి అంగీకరించారు. ఆదేవిధంగా proviso లో చేర్చారు. దానితో కాలేజీ ఆవిధంగా accept చేయవచ్చునని అనుకుంటూయున్నాం.

Deputy Speaker — I now put the amendment of Sri C. V. K. Rao to the vote of the House.

Deputy Speaker.— The question is —

That in clause 18, class-II. Other Members, item (1), for the word 'three', substitute the word 'six', and in item (3), for the word 'three' substitute the word 'two'

Add the following proviso after item (3):

Provided that no salaried teacher of the University either in his capacity as member of the Sentate, or academic Council, or both, shall take part in, or vote, at the elections conducted to the Syndicate and to the executive posts of officers of the University, as defined in clause 9.'

The motion was lost.

Sri N. Sivarami Reddi :— I am not pressing the amendment.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:— I move, Sir, that in—

Item (1) for the word 'three' substitute the word 'four'.

The amendment was put to vote and carried. Clause 18 as amended was put and carried.

## CLAUSE 19

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— I move Sir, that clause 19 do stand part of the Bill.

Deputy Speaker :— The motion moved is that clause 19 do stand part of the Bill. Sir C. V. K. Rao will please move his amendment.

Sri C. V. K. Rao :— అధ్యక్షా, item (o) నుంచి "to delegate any of its powers to the Vice-chancellor" అన్నమాటలను omit చేయవలసినదనే సవరణను ప్రతిపాదిస్తున్నాను. విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షునికి ఈ చట్టంరీత్యా ఎన్నో

అధికారాలు ఉన్నాయి వాటికితోడు సిండికేటుయొక్క అధికారాలనుకూడా ఆయనకు ఇచ్చినచో ఒకే వ్యక్తి అన్ని సంస్థలమీద పెత్తనం చలాయించే అవకాశంఉంది. సాధ్యమైనంతవరకు, ఇక్కడ ఒక కమిటీకి అధికారాలు ఇవ్వడంవల్ల బాగాఉంటుంది అనే ఉద్దేశముతో ఈ సవరణను suggest చేస్తున్నాను ఇది చిన్న amendment, దానిని అంగీకరించవచ్చును. ఒక చిన్నకమిటీ అయితే నలుగురి అభిప్రాయాలను తెలుసుకొనుటకు వీలు ఉంటుంది అని మంత్రిగారికి తెలుసును.

Sri K Krishna Rao — దీనిని నేను second చేస్తున్నాను.

The Hon Sri S B P. Pattabhirama Rao — Day to day administration ను వైస్‌ఛాన్సలరు చేయవలెను. సిండికేటు ఉత్తరువులుపొంది, పని జరగడం వీలుకాదు. Vice Chancellor is answerable to the syndicate కమిటీముందు విచారణచేసి, అది అంతా సిండికేటుకు రిపోర్టుచేస్తారు. Day to day administration సుళువుగా ఉండవలెను. అందువల్ల ఇది ఉంచమని కోరుతూఉన్నాను. C. V. K. రావుగారిని సవరణను withdraw చేసుకొనమని కోరుతున్నాను.

Sri K. Krishna Rao :— మద్రాసు విశ్వవిద్యాలయ చట్టంలో

"A committee constituted from among its members and a committee appointed in accordance with the Statute."

ఇది ఉంది.

Sri C V. K. Rao :— వైసుఛాన్సలరుకు కొన్ని అధికారాలు ఉన్నాయి. వాటికితోడు సిండికేటు అధికారాలు అన్నీ వైస్‌ఛాన్సలరుకు ఇవ్వడం బాగా ఉండదు. ఒక చిన్న కమిటీకి ఇస్తే బాగా ఉంటుంది అని మా ఉద్దేశం.

Deputy Speaker.— I now put the amendment of Sri C. V. K. Rao to the vote of the House. The question is:

'In item (o), delete the words 'to delegate any of its powers to the Vice-Chancellor.'

The amendment was lost.

Clause 19 was put and carried.

Clause 20 was put and carrred.

## CLAUSE 21

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— I move, Sir, that clause 21 do stand part of the Bill.

Deputy Speaker :— The motion moved is that clause 21 do stand part of the Bill.

Sri C. V. K. Rao — I beg to move: "Omit the proviso after sub clause (3)."

అవసరమైన ఖర్చు పెట్టుటకు పెట్టకుండ ఉండుటకు సెనేటుకు అధికారాలు ఉండవలెను. అధికారాలు సిండికేటుకే ఉంచేటట్లయితే సెనేటుయొక్క అభిప్రాయాలు తెలుసుకోకుండా ఉండడం జరుగుతుంది. అందుచేత సెనేటు దానిమీద అభిప్రాయం తెలపాలి. ఈ proviso ను omit చేయవలెనని కోరుతున్నాను.

Sri K. Krishna Rao — Sir, I second it.

In the Madras University Act the corresponding section says, "the annual account and the financial statement shall be considered by the Senate and the Senate may pass resolutions, which shall take action in accordance thereof."

ఇటువంటి అవకాశం సెనేటుకు ఉండాలి కనుక ఈ సవరణను అంగీకరించమని కోరుతున్నాను.

The Hon. Sri S. B. P Pattabhirama Rao — ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆక్టులో ఇటువంటి proviso ఉన్నదని నా ఉద్దేశం మనకు ఉన్న డబ్బులోనే ఖర్చు పెట్టవలెను. గవర్నమెంటు అయితే డబ్బు చాలకపోతే మరి ఏవిధముగనైనా డబ్బు సేకరించి ఖర్చు పెట్టుటకు అవకాశం ఉంది. కాని University కి ఆటువంటి అవకాశాలు లేవు. అందువల్ల ఇది restrict చేయవలెనని ఒక proviso పెట్టాము. మొత్తం మీద experience ను upset చేయడానికి వీలులేదని చెప్పాను. C. V K. రావుగారిని, ఈ సవరణను withdraw చేయమని కోరుతూ ఉన్నాను.

Sri C. V. K. Rao — అంగీకరించకపోతే, వోటుకు పెట్టమని కోరుతున్నాను.

The amendment was put to vote and lost.

Clause 21 was put and carried.

## CLAUSE 22

Sri T. Nagi Reddi :— We will have to add a small proviso and we can do it here or when we take up clause 24, about the medium of instruction.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— We can do it in clause 24.

Deputy Speaker :— The question is :

That clause 22 do stand part of the Bill

The motion was carried.

CLAUSE 23

Deputy Speaker.— The question is

That clause 23 do stand part of the Bill

The motion was carried.

CLAUSE 24

The Hon. Sri S. B. P. Pattabhirama Rao — I move

"Add the following at the end:

"(k) to make regulation relating to the use of Telugu as medium of instruction and examination."

The motion was carried.

Deputy Speaker.— The question is·

That clause 24, as amended, do stand part of the Bill.

The motion was carried.

Clauses 26 and 27

Deputy Speaker:— The question is:

That clauses 26 and 27 do stand part of the Bill.

The motion was carried.

CLAUSE 27—A.

Sri C. V. K. Rao:— I move:—

"After clause 27, add the following new clause 27-A: '27-A. No person shall be eligible to vote from more than one authority of which he is a member at elections conducted from those authorities to the Syndicate"'.

Sri K. Krishna Rao:— Sir, I second the amendment. సెనేటులో వుంటూ Academic Council లోగూడ వుండుటవల్ల, ఒక మనిషికి రెండు ఓట్లు వుంటాయి. ఒక్క మనిషికి రెండు ఓట్లు ఉండడం మంచిది కాదు కనుక ఈ సవరణను అంగీకరించగోరుతున్నాను.

Sri T. Nagi Reddi:— ఒకమనిషి graduate constituency కి elector గా ఉండవచ్చును, మ్యునిసిపల్ council కు elector గా వుండవచ్చును, Assembly Member గా వుండవచ్చును, వివిధసంస్థలకు elector గా వుండటానికి వీలువున్నది. నాగిరెడ్డి graduate constituency కి elector గా వుండవచ్చు. మునిసిపల్

కౌన్సిలుకు elector గా వుండవచ్చు, పంచాయితీబోర్డుతరఫున elector గా వుండవచ్చును, State Assembly కి elector గా వుండవచ్చును. ఎక్కడో extraordinary cases లో ఆ విధంగా జరుగుతుంది ఈ సవరణను పెట్టటమువల్ల వచ్చిన ప్రత్యేకమైన లాభం ఏమీలేదు. దీనివల్ల 2 ఓట్లు తగ్గవచ్చును

The Hon. Sri N. Sanjeeva Reddi — He is himself giving two votes, one as Municipal Chairman and the other as a member of the Assembly.

Sri C. V. K. Rao — ఒకమనిషికి రెండు ఓట్లు వుండటం సబబుగాదు. Senate election జరిగినప్పుడూ, Syndicate election జరిగినప్పుడూ, అతను రెండు చోట్లా ఓటుచేస్తున్నాడు. ఇందువల్ల యిబ్బందులున్నాయి. అతనికివున్న ఓటు Senate election లోనో, Syndicate election లోనో, ఒక్కదానికే ఓటుచేయటానికి అవకాశం వుండాలి. విద్యామంత్రిగారికి ఈ విషయం పూర్తిగా తెలుసును. అవసరమైతే experts అని చెప్పబడే, రంగధామిరావుగారినికూడ, వారు consult చేయవచ్చును. మ్యునిసిపల్ elections జరుగుతున్నప్పుడు, ఒక మనిషికి రెండు వార్డులలో ఓట్లువుండవచ్చును. కాని, అతను ఆ రెండు వార్డులకు వెళ్లి, రెండుసార్లుగా ఓటుచేయటంలేదు. ఒక్క ward area లోనే అతను ఓటుచేస్తాడు. ఆ మాదిరిగానే యిక్కడకూడ జరగవలసివుంటుంది. కాబట్టి ఒక member కు ఒకే ఓటువుండటం, ఆ ఓటుద్వారా సభ్యులను Syndicate కు ఎన్నుకోవటం మంచిదని చెబుతున్నాను

Sri M. R. Appa Rao — ఒకరు Syndicate కు, Academic Council కు నిలబడవచ్చును. మరొకరు Senate కు Academic Council కు వుండవచ్చును. Member కు రెండు ఓట్లు వుండటంవల్ల, తనయిష్టం వచ్చినప్రకారం ఓటుచేస్తాడు. పైగా యీ elections ఒకేపర్యాయం జరుగవు. అది ఒకప్పుడు, ఇది ఒకప్పుడు జరుగుతుంది. ఇది ఎట్లా disqualify చేస్తాం. అట్లాచేయటానికి వీలులేదు, అది కుదరదని చెబుతున్నాను.

Sri K. Krishna Rao — ఒకేమనిషి Academic Council కు member గానూ, Syndicate కు member గానూ వుండవచ్చును అనేదానివల్ల కొద్దిమందిచేతులలోనే University వుండటం జరుగుతోంది. ఇది చాలా ప్రమాదకరమైన విషయం. దీనిని solve చేయటం మంచిది. లేకపోతే యిబ్బందులున్నాయి.

Sri. C. V. K. Rao :— నేను ఒక విషయము clarify చేస్తున్నాను. Syndicate కు ముగ్గురిని Senate నుండి ఎన్నుకోవాలి, ఇద్దరిని Academic Council నుంచి ఎన్నుకోవాలి. Academic Council లో Vice Chancellor ఉన్నారు. Director of Public Instrection ఉన్నారు. Whole time University Professors ఉన్నారు. Principals of the University and the affiliated colleges ఉన్నారు. ఇప్పుడు వీరందరుకూడ ఇద్దరను Syndicate కు ఎన్నుకోవాలి.

[Sri R. Lakshminarasimham Dora] [1st June 1954

"When the Bill is so brought up for further consideration at a subsequent sitting, no amendments, not being of a verbal or consequential nature, shall be made by the Assembly.

At any time after the conclusion of such further consideration, if any, the member in charge of the Bill may move that the Bill be passed into law".

The Hon. Sri T. Viswanatham — వావిలాల గోపాలకృష్ణయ్యగారు అది unreasonable గా ఉందంటున్నారు. కాని Speaker గారు అది unreasonable కాదని చెప్పారు. అది frivolous గానూ లేదు, unreasonable గానూ లేదు. అందులో clear గా ఒకదాని తరువాత ఒకటి ఉన్నాయి. అందుచేత అందులో ఏమీ యిబ్బంది లేదు. పట్టాభిరామారావుగారు కాఫీ త్రాగడానికి reacess కావాలని అంటున్నారు. అందుచేత కొంత recess కూడా యివ్వవచ్చు, ఆవిధంగా అన్నివిధాలా సంతృప్తికూడా కల్గుతుంది.

Sri Vavilala Gopalakrishnaiah — అది rules book లోంచి చదివాను. అవి rules కాదని అంటున్నారు.

Deputy Speaker :— Rules లోంచి చదివితే వారుమాత్రం rules కాదని ఎలా అంటారు ?

The Hon Sri S. B P. Pattabhirama Rao :— మధ్యాహ్నంనుంచీ కూర్చున్నాము. అందరికీ ఆకలవుతోంది. అంతేకాకుండా 4-30 గంటలలోపల రాహుకాలం ఉంది. 4-30 గంటలైనతరువాత శ్రీతిరుపతి వేంకటేశ్వర విశ్వవిద్యాలయం Bill third reading మొదలుపెడితే తీరిపోతుంది.

Deputy Speaker .— అన్ని clauses మీద discussion అయిపోయింది. ఇది continue చేసి third reading చెసేద్దాము. మీరుకాదంటే 10 నిమిషాలు adjourn చేస్తాను.

Sri Vavilala Gopalakrishnaiah :— చేయండి.

Deputy Speaker :—All right, I am adjourning the House till 4-30 p. m.

**The House then adjourned.**

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— అధ్యక్షా, ఈ బిల్లు third reading 4-30 p. m. కు ప్రతిపాదన చేస్తూ యీ బిల్లు సమగ్రంగా చర్చచేసి దానికి క్లాజువారీగా వివరంగా పరిశీలనచేసి యింతవరకు second reading pass చేయించినందుకు ధన్యవాదాలు. ఈ బిల్లు ఆంధ్రరాష్ట్రం వచ్చినతరువాత వెంకటేశ్వర విశ్వవిద్యాలయం

నెలకొల్పబడినతరువాత ఆంధ్రరాష్ట్రం ప్రప్రథమంగా మన యీ లెజిస్లేటివ్ అసెంబ్లీ చేసిన ఘనకార్యాలలో ఒకటిగా బంగారు అక్షరాలతో వ్రాయబడివుంటుందని మనవిచేస్తున్నాను. విశ్వవిద్యాలయంసృష్టి సామాన్యమైనపనికాదు. 26 సంవత్సరాలపూర్వం ఆంధ్రవిశ్వవిద్యాలయంసృష్టికాబడినది. దాని అభివృద్ధికోసం ఈ నాటివఱకు ఎంతమంది పనిచేశారో మీకందరకు తెలుసును ఈ నాడు ఆంధ్రవిశ్వవిద్యాలయం హిందూ విశ్వవిద్యాలయాలలో పేరుగల విశ్వవిద్యాలయాలలో ప్రప్రథమస్థానం ఆక్రమిస్తున్నదని సగర్వంగా మనవిచేస్తున్నాను. అదేఆశయంతో త్వరలో, అచిరకాలంలో వెంకటేశ్వర విశ్వవిద్యాలయం స్థాపించబోతున్నాం. శ్రీ వెంకటేశ్వరులకు హిందూదేశంలో ఎంత పలుకుబడివున్నదో, వెంకటేశ్వరసామివారి భక్తశ్రేణి ఎంతవరకువున్నదో అలాగే ఈ వెంకటేశ్వరవిశ్వవిద్యాలయం ఎంతో మార్గదర్శకత్వాన్ని చూపిస్తుందని అనుకుంటాను.

ఇది క్రమశః అచిరకాలంలో affiliated college అయి ఆ ప్రాంతములలో వున్న అన్నికాలేజీలకు లాభంకలుగజేస్తుందని నమ్ముచున్నాను. ఒకవిధంగా ఆలోచించి చూస్తే మనంచేసినది మంచిదేనని అనిపిస్తున్నది. Residential విశ్వవిద్యాలయం స్థాపనచేసి teaching side గట్టిగా భద్రపరచి తదుపరి develop చేసుకోడానికి అవకాశాలు చూపించి ఆ తరువాత affiliating sections కూడా తీసుకొంటె ఒకవిధంగా తొందరపడకుండా జాగ్రత్తగా steady గా చేయడానికి అవకాశంవుంటుంది. అందులో సందేహంలేదు. ఎవరయినా ఎందుకు ఆంధ్రరాష్ట్రం విడిపోయినతరువాత తమిళ రాష్ట్రంలో మనకాలేజీలను వుంచారు అనే నేరారోపణకు అవకాశంలేకుండా ఆంధ్రవిశ్వవిద్యాలయంలో చేరుస్తున్నాం. అదికూడా ఒకవిధంగా మంచిదే 2 సంవత్సరాల పాటు ఆంధ్రవిశ్వవిద్యాలయం ఉండి విషయాలు తెలిసికొన్న తరువాత వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఆ ప్రాంతం కళాశాలలు చేరడానికి అవకాశంవుంటుంది. ఒకవిషయంమాత్రం మనవిచేస్తున్నాను. ఈ నాడు ప్రభుత్వంయొక్క ఆశయముకాని, ప్రభుత్వపక్షంయొక్క ఆశయంగాని ఆంధ్రదేశాన్ని రెండుభాగాలుగా విడగొట్టడంకాదనీ దీనితో ఏ రాజకీయసంబంధంగాని లేదని మనవిచేస్తున్నాను. ప్రాంతీయవిభేదాలకు దీనిలో తావులేదని మనవిచేస్తున్నాను. ఈ విశ్వవిద్యాలయంలో ఆంధ్రులందరకు స్థానంవుంటుందని ఏవిధమైన వివక్షత చూపబడదని హామీయిస్తున్నాను. ఈ యూనివర్శిటీలో లేని కోర్సులకోసం ఆ యూనివర్శిటీలోకి ఆ యూనివర్శిటీలో లేని కొన్నికోర్సులకోసం యీ యూనివర్శిటీలోకి, యిక్కడవున్నవారు అక్కడకు, అక్కడవున్నవారు యిక్కడకు చేరవచ్చు. ఈ యూనివర్శిటీలు రెండూ ఆంధ్రదేశంలోనే కాక భారతదేశంలో మొదటిస్థానం ఆక్రమిస్తాయి. ముఖ్యంగా తిరుపతిలో రేపు త్వరలో ఈ బిల్లుకు assent యివ్వబడగానే వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రారంభించబడుతుంది. మీ అందరి సహకారానికి నా ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

తమరుకూడా అధ్యక్షస్థానంలోయుండి చాలా చక్కగా నడిపి ఈవేళా, నిన్నాకూడా ఓర్పుతో అందరకి సమాన అవకాశాలు ఇప్పించి బిల్లు ముందుకు నడిపించుటకు వెళ్ళ

కల్గినందులకు ధన్యవాదాలు అర్పిస్తున్నాను. సభ అంతకూ కూడా ఈ బిల్లు నడిపించినందులకు ధన్యవాదాలర్పిస్తూ మూడవరీడింగు చర్చించి ముగింపుచేయవలసినదిగా కోరుచున్నాను.

Deputy Speaker —I can allow only two minutes for each speaker.

Sri K. Krishna Rao — మూడవరీడింగు పూర్తిచేసేముందు కొన్ని విషయాలు చెప్పవలసియున్నది సాధారణంగా ఏ యూనివర్శిటీ వచ్చినా ప్రతివారూ ఆహ్లాదించవలసిన విషయం. మన సాంస్కృతిక అభివృద్ధికి దోహదమిచ్చే సంస్థలలో యూనివర్శిటీ గొప్ప సంస్థ. ఎక్కువమంది యూనివర్శిటీ చదువుకు రావడం, కొంతమందినే select చేయడం చాలామందిని select చేయకపోవడం, ఎక్కువమంది విద్యార్థులు పాసయితే ఉద్యోగాలు చూపించలేమనడం వల్ల education కు free scope లేకుండాచేయబడుతోంది. విద్యార్థులలో ఒకవిధమైన నిస్పృహ ఏర్పడుతోంది. పిల్లకాయలూ, తల్లిదండ్రులూకూడా చాలా బాధపడుతున్నారు. అటువంటి పరిస్థితులలో ఈ యూనివర్శిటీ వస్తోందంటే దానిని power politics లోకి తీసుకు వెళ్లుటకు అవకాశాలున్నాయి ఆ భయంతో ఎక్కువ బీతాహంతో బిల్లు discuss చేయడం జరిగింది. నేను 1924 లో యూనివర్శిటీ పరీక్ష పాసైనాను. 1924 లో దీనిని ఆహ్వానించేవారం కాని ఈ నాటిపరిస్థితులు వేరుగా ఉన్నాయి. సాంస్కృతి కందామనుం అభివృద్ధి చెందామనేది సందేహాస్పదమైన విషయం కాబట్టి రాయలసీమ యూనివర్శిటీకి గవర్నమెంటు సహాయం ఇచ్చి College education కు సౌకర్యాలు కలుగజేయాలని కోరుచున్నాను.

The Hon. Sri K. Koti Reddi .— ఉపాధ్యక్షా! Education Minister గారు అభినందనీయులు. ఈ యూనివర్శిటీకి చరిత్రను నాకుకొంచం సంబంధం ఉండినది. అందువల్ల మీ ఉత్తరువుపొంది నాలుగుమాటలు చెప్పదలచుకొన్నాను. కాని చరిత్రవిషయంగురించి హెచ్చుగా చెప్పదలచుకోలేదు. నాగిరెడ్డిగారు ఒకప్పుడు నేను ఎప్పుడో ఈ యూనిర్శిటీని గురించి ఆటంకం పెట్టానని అన్నారు. నేను ఎట్టి ఆటంకం పెట్టలేదని మనవిచేస్తున్నాను ఒకప్పుడు వెంకటేశ్వరయూనివర్శిటీ ఏవిధంగా ఉండవలసిందని చెప్పి పంతులుగారు నన్నుకోరినప్పుడు వెంకటేశ్వరస్వామి డబ్బు ఎంత ఉంటుంది అనే విషయంగురించి 1946 వ సంవత్సరంలో మెమోరాండం పంపినాను. ఇది Affiliating యూనివర్శిటీ యా, లేక Residential యూనివర్శిటీ యా అనే విషయంలో తగాదా వస్తుందని నేననుకోలేదు. దానిని Residential యూనివర్శిటీగా develop చేసి ఆంధ్రా యూనివర్శిటీలో develop కాని విషయాలను ఈ వేంకటేశ్వరయూనిర్శిటీలో develop చేస్తామని ఆలోచకోలు, మొదలైనవన్నీ అక్కడ develop చేయాలని ఆశ. Fundamental research కూడా ఆ యూనివర్శిటీలో develop అయ్యేటందుకు అవకాశాలం కల్పించాలని మా ఆశయం. ఒక్క విశాఖపట్టణం మాత్రమేకాకుండా [illegible] యూనివర్శిటీని కేంద్రంగా చేయవచ్చును. ఆ promise ఇచ్చాము. ఇది రాయలసీమ యూనివర్శిటీ అని, దీనికి వారికి

విభేదాలున్నాయని అనుకోవద్దు. ఈ దేశంలోఉండే పరిస్థితులను బట్టి ఇది వచ్చిందికాని పశ్చిమదేశాలలో affiliating యూనివర్శిటీలు చాలా తక్కువ. Residential University లో professors, tutors, students ఒకటిగా కలిసిమెలిసి స్నేహభావంలో ఉండడానికి అవకాశం ఉంటుంది. Professor Dixon అనే ఆయనదగ్గర Oxford లో చదివాము. నాలుగయిదుమంది students ఉండేవాళ్ళం మేముకోరినట్లు, చెప్పమంటే ఆయన గంటలకొలదీ నిలిచి బోధించేవాడు. మాతో subjects అన్నీ discuss చేసేవాడు. అదీ residential యూనివర్శిటీవల్ల లాభం మాకు భేదంలేదు. ఈ ప్రాంతం వారు అక్కడకు ఆ ప్రాంతంవారిక్కడకు పోవుటకు అవకాశం ఉంది. Arts College లు develop కావచ్చును. కాని fundamental research పంతులుగారు కోరినట్లు ప్రపంచానికి ప్రాముఖ్యమైన Oxford, Cambridge యూనివర్శిటీలవలె develop చేయుటకు మీరంతా సహాయపడతారని నమ్ముచున్నాను.

Sri Lakshmana Das :— అధ్యక్షా, ఈ అవకాశం ఇచ్చినందుకు ధన్యవాదాలు అర్పిస్తూ ఉన్నాను. ఈనాడు ఆంధ్రదేశములో మొట్టమొదట ప్రారంభమైన ఈ శాసనసభ యూనివర్శిటీని స్థాపించుకొనుచున్నది. అంటే అది సువర్ణ అక్షరాలతో వ్రాయతగినదే. అనేక శాసనములు చేయవచ్చును. అవి కలక్రిందులు కావచ్చును ఈ విశ్వవిద్యాలయాన్ని ఎవరువచ్చినా దానిని అభివృద్ధిచేయుటకు పూనుకొంటారే గాని మరి ఏ విధముగ పాడుచేయుటకు పూనుకోరు. ఈబిల్లును ముఖ్యముగా తీసుకొనివచ్చినందుకు, ఇంత స్వల్పవ్యవధిలో ఇటువంటి సాహసకార్యాని పూనుకొన్నందుకు ముఖ్యముగా మంత్రిగారికి శాసనసభ్యులకు నా ధన్యవాదాలు అర్పిస్తున్నాను. రెండవది యూనివర్శిటీ చిత్తూరుజిల్లాలో స్థాపించబడడం శుభదాయకమని అనుకొంటాను. C. R. రెడ్డిగారు ఎంతో త్యాగముచేశారు. ఎంతో కష్టపడ్డారు. ఆయన చేసిన త్యాగఫలితంగా ఈ యూనివర్శిటీ ఎంతో అభివృద్ధి అయింది. ఈ శాసనము, ఈవాల్తేరు శాసనసభలో తయారుకావడం అంటే వాల్తేరు కొంత ఋణము తీర్చుకొంటుంది.

దీనిలో కొత్తగ స్థాపించుకొన్న విశ్వవిద్యాలయంలో తయారు అయినవారు దేశములో స్వయంపోషకముగ ఉండగలరని అటువంటి అవకాశములు ఇందులో కల్పించ వలసిన బాధ్యత ప్రజలపైన ప్రభుత్వంపైన ఉన్నదని భావిస్తూ ఈ అవకాశం నాకు కల్పించినందుకు ధన్యవాదాలు ఇస్తూ విరమించుకొంటూ ఉన్నాను.

Sri R. Lakshminarasimham Dora :— ఈ విశ్వవిద్యాలయం బిల్లు జయప్రదముగ ఈ house లో కొనసాగించినందుకు మంత్రివర్గానికి ధన్యవాదాలు ఇవ్వవలెను. అయితే ఒక reservation మాత్రం ఉంది. దేశంలో ఆహారం, గుడ్డ, ఇండ్లు, elementary education, ఆరోగ్యం, వైద్యం మున్నగువిషయాలు, వెనకపెట్టి దీనిని ఎందుకు ముందరపెట్టారో నాకు బోధపడుటలేదు. ఇదేవిషయం సెలక్టుకమిటీలో చెప్పాను.

Sri R. Lakshminarasimham Dora] [1st June 1954

నేను ఏకాకి అయినందున ప్రయోజనంలేకపోయింది. రాష్ట్రంలో విద్యాసౌకర్యములు ఎక్కువ అవుతుంది. పూర్వకాలంలో రాయలసీమలో వేరే విశ్వవిద్యాలయం లేనందున అప్పుడు శ్రీ బాగుపాట్టు అని ఒకటి పెట్టారు. అది ఇంతటితో నశించుచుతుంది అని ఒక ఆశ కలుగుతున్నది. విశ్వవిద్యాలయం వచ్చినందుకు సంతోషించుచున్నాను. రాయలసీమలో వెనుకబడి ఉన్నవిద్యార్థులు మద్రాసులో పడుతూఉన్న ఇబ్బందులను తొలగించి, ఈ విశ్వ విద్యాలయంలో ఉన్నతసౌకర్యాలు కల్పిస్తూఉండుటకు, చాలా సంతృప్తికరమైనవిషయం. కనుక మరొకసారి మంత్రివర్గాన్ని అభినందిస్తున్నాను. ప్రతిపక్షనాయకునికూడ అభినందించ వలసియున్నది. వారిసహకారము లేకపోతే, ఈ బిల్లు ఈ రూపములో రాకుండాపోయి ఉండవచ్చును. ఇది వారి సహకారమువల్లనే ఈ రూపము దాల్చింది.

Sri P. Pundarikakshacharyulu — అధ్యక్షా! మంత్రిగారు మూడవ రీడింగు ప్రతిపాదనచేస్తూ ఈ బిల్లు భావికాలంలో సువర్ణాక్షరాలతో వ్రాస్తారని చెప్పారు నిజమే. ఎందుచేతనంటే, పూర్వము ప్రతిపాదించిన బిల్లుకంటే ఇప్పుడు తయారు అయిన ఈ బిల్లులో చాలా redeeming features ఉన్నవి. ఛాన్సలరుగ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిని ఏర్పాటుచేసుకొన్నాము. సాధారణంగా ఎక్కడలేనివిషయం ఇది. High Court జడ్జిని chancellor గ పెట్టుకొనే అదృష్టము మనకే కలిగింది. ఇది అనుభవములో బాగా పనిచేస్తే దానిని ఆదర్శముగ తీసుకొని ఇతర యూనివర్శిటీలలోకూడ మార్పుచేసుకొనుటకు అవకాశంకలుగుతుంది. మన ముఖ్యమంత్రిగారు చెప్పినట్లు మనదేశంలో తయారు అయిన graduates పరీక్షలు ప్యాసుచేసినతరువాత, 20, 25 సంవత్సరముల వయస్సు గడచిన తరువాత నేను ఏలా జీవిస్తాను, ఏవృత్తి చేయగలను, అని యోచనచేయవలసివుంటుంది. ముఖ్యమంత్రిగారు చెప్పినటుల ఈ విశ్వవిద్యాలయంలో తయారు అయినవాండ్లకు అటువంటి భీతి కలుగకుండ స్వతంత్రజీవనము చేసికొనగల, బ్రతుకుతెరువును చూపించగల విద్యను ఇవ్వవలెనని కోరుతూ విరమిస్తూ ఉన్నాను.

Sri M. Hanumantha Rao — కమ్యూనిస్టుపార్టీ మొదటినుంచీ, తిరుపతిలో ఒక University ఏర్పడాలనిచెప్పి, చాలాకాలమునుండి తీవ్రముగా ప్రచారముచేస్తూవస్తున్నది. కాని, ఆ University residential గా వుండాలని ఖచ్చితముగాచెప్పాము. ఆవిధంగా కొంతకాలం ప్రచారంచేశాం. దురదృష్టవశాత్తు అది సాధ్యంగాలేదు. ఇప్పటికైనా ఒక విశ్వవిద్యాలయం ఏర్పడుచున్నందులకు చాలా సంతోషము. దానిని ఆంధ్రులందరముకూడ బలపరుస్తూ ఇది ఒక ప్రత్యేకమైనప్రాంతానికి సంబంధించిన విశ్వవిద్యాలయంగాదనిచెప్పి (నమ్ముతూ), దీనిని పెంపొందించటానికి అవుసరమైన సహాయమును చేయుటకు యావదాంధ్రులు పూర్తిగా తోడ్పడగలరని, నేను గాఢముగా నమ్ముతున్నాను. మా కమ్యూనిస్టుపార్టీ పూర్తిగా యీ University విషయంలో తోడ్పడుతుంది. మనమందరము రెండవ University ఏర్పడినందులకు సంతోషిస్తూ, ఇది చిరకాలము వర్ధిల్లాలని కోరుకొనుచుని మనవి చేస్తున్నాను.

Sri P. Gunnayya — ఈ సమావేశం క్రిందటినెల 10వ తేదీనుండి జరుగుతున్నది. డిప్యూటీస్పీకరుగారి అధ్యక్షత, యీ సమావేశం ఇంత బాగా జరిగినందులకు ప్రభుత్వంవారికీ, ప్రతిపక్షమువారికి - ఇక్కడకు 600 మైళ్లు దూరమున వున్న ప్రజాప్రతినిధులు వచ్చి, విశాఖపట్నంలో "కాపిటల్" పెట్టాలన్నా, కాదా ఒప్పుకొని కర్నూలును capital చేసినప్పటికీ - ప్రభుత్వం ప్రతిపాదిస్తున్నటువంటి యీ బిల్లును, సమగ్రంగా జరిపించినందులకు ప్రతిపక్షంవారికీ, ప్రభుత్వంవారికీ - నా కృతజ్ఞతాభివందనములు తెలుపుతున్నాను

ఆంధ్రరాష్ట్రంవచ్చి 8 మాసాలైంది. ప్రభుత్వం యీ స్వల్పకాలంలో గొప్ప ఘనకార్యాలుచేసిందని చెప్పవచ్చును. బ్రహ్మంగారి చరిత్రప్రకారం కాపిటల్ కర్నూలులో వచ్చింది. తిరుపతి వెంకటేశ్వర్లు పేరుతో, ఒక విశ్వవిద్యాలయాన్ని, ప్రభుత్వంవారు, ప్రతిపక్షంవారు తిరుపతిలో ఏర్పాటుచేశారు. ఆంధ్రజిల్లాల్లో ప్రాముఖ్యమైనటువంటి పట్టణాలు అక్కడక్కడా వున్నాయి. అలాంటి పట్టణాల్లో కొన్నికొన్ని ప్రాముఖ్యమైనటువంటి పనులు చేయించాలి. మా ప్రాంతంలో బొబ్బిలి చాలా ప్రాముఖ్యమైనపట్టణం. వీరబొబ్బిలిగా ప్రాముఖ్యతచెందినది. మావి వెనుకబడినజిల్లాలు. బి. ఏ., వరకు చదువుకోడానికి కాలేజీలు లేవు. చీపురుపల్లి, బొబ్బిలి, పార్వతీపురం, సాలూరు చోట్లగూడ బి. ఏ., కాలేజీలు ఏర్పాటుచేయాలని కోరుతున్నాను.

Sri K. V. Ramesam — చిరకాలముగా వాంఛిస్తున్న కోరిక నెరవేరుతున్నందున ఇది శ్రీ వేంకటేశ్వరస్వామి మాయ అని తోస్తున్నది. రాజకీయపరిస్థితులనుబట్టి యీ బిల్లు ఆమోదింపబడదని నిన్నవున్న వాతావరణంబట్టి అనుకున్నా, శ్రీ వేంకటేశ్వర స్వామివారి 'మాయ'వల్ల, రాయలసీమవాసులయొక్క సహకారంతో, యీ బిల్లు జయప్రదంగా నెగ్గినందులకు ప్రభుత్వంవారు అభినందనీయులు. ఇది start చేయటములో economicalగా, ఏ విధమైనటువంటి ఆధారము లేకపోయినప్పటికీ, ప్రభుత్వం పూనుకున్నందులకు అభినందనములు తెలుపుతున్నాను. వాల్తేరు Universityలో లేనటువంటి unemploymentను solve చేసే వృత్తులకు సంబంధించిన కోర్సులను (టెక్నికల్ కోర్సులను) యీక్రొత్త Universityలో నెలకొల్పి, రాయలసీమవారికి, సర్కారుజిల్లాలవారికి సౌకర్యం కలిగించవలెనని కోరుతూ, ఇంతటితో ముగిస్తున్నాను.

Sri D. Sitharamayya :— కమ్యూనిస్టుపార్టీ తరఫున తిరుపతిలో విశ్వవిద్యాలయం కావాలని చాలా సంవత్సరములనుండి ఆందోళన చేస్తున్నాము. రాయలసీమ ప్రజలు కోరినప్రకారం తిరుపతిలో విశ్వవిద్యాలయం ఏర్పడుతున్నది. మేము యీ University residential గా వుండాలని కోరుతూ వచ్చాం. అందువల్ల ఆంధ్రజాతి ఐక్యతను సాధించడానికి అవకాశం వుంటుందని కోరాము. Affiliating University ని పెట్టామంటే ఆంధ్రజాతి ఐక్యతను రెండుగా చీలదీసే ఏర్పాటు చేస్తుందని చెప్పాము. తిరుపతి University బలవత్తరం కావాలంటే, రాయలసీమలోని High Schools ను చాలా

అభివృద్ధిచేయాలి. క్రొత్త High Schools తెరవాలి. ఎలిమెంటరీ స్కూళ్లు పెట్టబడాలి. ఇంకా రాయలసీమ జిల్లాలలో "టెక్నికల్" కాలేజీల అవసరం వుంది. ప్రభుత్వం తగు చర్యతీసుకుంటుందని ఆశిస్తున్నాను Tirupati వెంకటేశ్వర యూనివర్శిటీని బలవత్తరం చేయవలెనని కోరుతున్నాను. ఈ క్రొత్త విశ్వవిద్యాలయము ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు పోటీ సంస్థగా వుండకుండ రెండూగూడ సోదరభావంతో వుండాలి. ఆంధ్రజాతి ఐక్యతకు మార్గం చూపించాలని కోరుతూ యీ విశ్వవిద్యాలయము మా జిల్లాకు వస్తున్నందుకు మేము సంతోషిస్తున్నాము.

Sri K. Adikesavulu Naidu.— ఆంధ్ర విశ్వవిద్యాలయం 1923 లో ప్రారంభం అయింది. ఆ రోజులలో ఇప్పుడున్న రాయలసీమ సర్కారు విభేదాలు లేవు. కాని ఇప్పుడు అన్ని రాజకీయపార్టీలు కలసి చిరకాలముగా ఆశిస్తున్నకోర్కెను మన్నించినందులకు సభవారిని అభినందిస్తున్నాను. విశ్వవిద్యాలయం స్థిరపడడానికి అందరియొక్క సహకారం కావలసియున్నది. కాబట్టి అందరు వీలయినంతవరకు ధనసహాయం చేస్తూ యీ University ని అభివృద్ధిచేయటానికి సహకరించవలసినదిగా కోరుతున్నాను. Science courses గూడ స్థాపించటానికి పూనుకోవాలని కోరుతున్నాను.

Sri Vavilala Gopalakrishnaiah:— ఆంధ్రులు చిరకాలంగా వాంఛిస్తున్న ఆంధ్రసంస్కృతికి, ఐకమత్యానికి ఈ నాడు పునాదులువేశాము. తిరుపతి యూనివర్శిటీ, residential గా ఉండాలా లేక affiliating గా ఉండాలా అనేదాంట్లో తప్ప, వేరే అభిప్రాయభేదాలు లేవు. ఇది ఆంధ్రజాతి ఐక్యతకు విజ్ఞానాభివృద్ధికి సంబంధించిన విషయం. అసలు యూనివర్శిటీ వద్దని, ఎవరు అనలేదు. ఈ తీర్మానమును అందరు ఒప్పుకున్నందులకు, నేను ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. నిన్న నేను ఒక non-official బిల్లు ఒకటి తెచ్చాను. అది వీగిపోయింది. అందువల్ల, నాకు నేనే అభినందించుకొంటున్నాను. ఇంతటితో మనబాధ్యత అయిపోలేదు. ఆంధ్రసంస్కృతిని అభివృద్ధికి సమన్వయం చేసుకుంటూ - రాయలసీమ సర్కారు అనే భేదాభిప్రాయాలు మరచిపోయి, స్థిరముగా వుండే విజ్ఞానమును ఏర్పాటుచేస్తారని కోరుతున్నాను.

Sri V. Chidanandam:— అధ్యక్షా! తిరుపతిలో ఒక యూనివర్శిటీ పెట్టుటకు ప్రభుత్వంవారు ముందుకువచ్చి ఈ బిల్లును ప్రవేశపెట్టినందుకు, వారిని మీద్వారా అభినందిస్తున్నాను. Affiliated courses కు అవకాశమిస్తున్న ఈ బిల్లును pass చేసినందుకు సభ్యుల కందరికి నా కృతజ్ఞత తెలుపుచున్నాను. శ్రీ లక్ష్మీనరసింహంగారు Sri Bagh Pa:t ఇంతటితో నశించిందన్నారు, కాదని చెప్పుతున్నాను. మా రాయలసీమకు ఇంకా వైద్యకళాశాల రాలేదు, Irrigation Power Sch3m3s రాలేదు. తరువాత Industrial గా కూడ రాయలసీమ ఎంతో develop కావలసియున్నది. రాయలసీమ జిల్లాలతరఫున మీకు సహాయంచేసిన మిత్రులందరికి అభినందనములు తెలుపుచున్నాను. [illegible] మీరు చేస్తున్నందుకు వారిని అభినందిస్తున్నాను. న్యాయంగా [illegible]

దృష్ట్యా నెల్లూరును అక్కడ చేర్చవలసియున్నది. ఎందుకనగా చిత్తూరు, కడపబార్డరులోనే నెల్లూరు ఉంటున్నది మాకు త్వరగా వైద్యశాలలుకూడ ఏర్పాటుచేస్తారని ఈ బిల్లును ప్రవేశపెట్టినందుకు శ్రీ పట్టాభి రామారావుగారికి మా కృతజ్ఞతను తెలుపుతున్నాను. నెల్లూరుతోకూడ మా 5 జిల్లాలలో ఇప్పుడు దాదాపు నూరు హైస్కూల్లు ఉంటాయి. వీటిలో 10 వేలమంది విద్యార్థులుంటారు. వీరికి కాలేజీలు తక్కువగా ఉన్నాయి. ఇప్పుడు మద్రాసు University నుంచి విడిపోయినా రెండుసంవత్సరములవరకు వారితో సంబంధముంచుకొని అటుతరువాత పూర్తిగా విడిపోవడం చాలా ముదావహము ఎందుకంటే, మేము ఇదివరకు అక్కడనుంచి విడిపోవడానికి ఒప్పుకోలేదు, ఏదేదోకష్టాలు భేదాభిప్రాయాలు వస్తాయని ఒప్పుకోలేదు. కాని ఈ రోజున అందరు ఒకవిధముగా రాజీకావడం చాలా తృప్తికరముగాను, సంతోషంగాను ఉన్నదని తెలియజేస్తూ విరమిస్తున్నాను.

Sri T. Nagi Reddi — అధ్యక్షా! ఈ బిల్లు పాస్ అవుతున్నటువంటి ఈ సందర్భంలో ఎంతో చర్చజరిగింది, ఎంతోమంది సభ్యులు amendments ఇచ్చి ఎన్నోవిషయాలు మాట్లాడారు. అటువంటిసందర్భంలో, ఇప్పుడు నేను ప్రత్యేకంగా చెప్పవలసిన దేమీలేదు ఆంధ్రదేశంలో ఇంకొక విశ్వవిద్యాలయము స్థాపించాలనేటటువంటి విషయము మాత్రము అందరు జ్ఞప్తిఉంచుకోవాలని నేను ప్రార్థిస్తున్నాను విశ్వవిద్యాలయము స్థాపించాలని బిల్లుచేయడం ఒక ఎత్తు, విశ్వవిద్యాలయాన్ని స్థాపించడం మరొకఎత్తు. బిల్లు చేసినంతమాత్రాన విశ్వవిద్యాలయస్థాపనకాదు - అది చాలా కష్టతరమైన కార్యక్రమము. ఆ కార్యక్రమాన్ని ఇక్కడ కొనసాగించేటటువంటి పెద్దలు, ఆ స్థాయి గలిగినవాళ్లు ఈనాడు మనకు లేకపోవచ్చు. కాని అందరముకలిసి పనిచేసినట్లయితే, ఆంధ్రదేశములో రెండవ విశ్వవిద్యాలయాన్ని సుస్థిరమైన పునాదులమీద స్థాపించి దాన్ని ఆంధ్రదేశములోని ఇతర విశ్వవిద్యాలయముయొక్క స్థాయికి తీసుకొనివచ్చి, సక్రమమైనటువంటి పద్ధతులలో అభివృద్ధికి తీసుకొనిరాగలుగుతామని నమ్ముచున్నాము. ఈ బిల్లు చర్చలో అనుకొని వదలి పెట్టినటువంటి విషయము ఒకటున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయానికి, తిరుపతి విశ్వవిద్యాలయానికి సన్నిహితమైన సంబంధము కలుపుకోవడానికి వీలుగా ఒక Co-ordinate Committee పెట్టి ఆరెండు విశ్వవిద్యాలయాలకు పోటీలేకుండా చేయాలని అనుకొంటూ వచ్చాము. కాని ఆ co-ordination విధిగా జరగాలనేటటువంటిదానిమీద ఒక clear-cut idea లేకపోవడంచేత, అటువంటిదాన్ని పెట్టడానికి వీలులేకుండాపోయింది. అయినా ఆ పద్ధతిలోనే ఇది నడపాలనికూడ ఆశిస్తున్నాను. ఇక్కడ లేనటువంటివాటికి అక్కడ ఆస్కారమిస్తూ, అక్కడ లేనటువంటివాటికి ఇక్కడ ఆస్కారమిస్తూ, రెండూ ఆంధ్రదేశము యొక్క సంస్కృతిని అభివృద్ధిచేసేపద్ధతులలో నడుపగలవని నేను ఆశిస్తున్నాను. ఆంధ్రదేశ ప్రజలందరుకూడ ఈ విశ్వవిద్యాలయానికి అన్నివిధాలుగాను తోడ్పడి ఈ విశ్వవిద్యాలయం యొక్క పురోభివృద్ధికి తగినటువంటి సహాయంచేస్తారని దీనికి అందరి సహాయసహకారాలు లభిస్తాయని ఆశిస్తూ సెలవుతీసుకొంటున్నాను.

[1st June 1954

The Hon. Sri T Viswanatham — అధ్యక్షా, ఇప్పుడు అంతమందీకూడ ఈ యూనివర్సిటీ బిల్లు pass అయినందుకు పరస్పరం అభినందించుకొంటున్నాను. ఈ సందర్భంలో నేనుకూడ శాసనసభకు నా హృదయపూర్వక కృతజ్ఞతను, అభినందనలను తెలియచేస్తున్నాను ముఖ్యముగా, విద్యాశాఖామంత్రిగారు మొదటనుండికూడ దీనిని చాలా జాగ్రత్తగా పరిశీలించి చాలా ప్రత్యేకమైనటువంటి శ్రద్ధతోను, నైపుణ్యంతోను, సామరస్యంతోను తీసుకువచ్చి ఇది శాసనసభ ముగింపువరకు అయినప్పటికికూడ ఏలాటి తొందరపాటు లేకుండా అతి శాంతంగా, చక్కగా చర్చజరిపి pass చేయించినందుకు ప్రత్యేకంగా వారిని అభినందిస్తున్నాను. దీనికి సహాయంచేసినటువంటి ఇతర అధికారులు చాలామంది ఉన్నారు. వారు చేసినటువంటికృషి అపారమైనటువంటిది. ఇదివరకు మొదట్లో ఈ యూనివర్సిటీప్రాంతీయంగా ఉంటుందని దీనివల్ల ప్రాంతీయ విబేధాలు ఏర్పడుతాయని కొంతమంది అభిప్రాయపడ్డారు. కాని అటువంటి భేదాలేమి రావని మనవిచేస్తున్నాను. దీన్ని తయారుచేయడంలో మాకాలాటి అభిప్రాయముగాని, భయముగాని ఏమాత్రంలేదు. మన ఆంధ్రదేశంలోనే కాకుండా, మన భారతదేశములోనే కాకుండా యావత్ ఆసియాఖండములో ఉన్నటువంటి యూనివర్సిటీలన్నిటిలో ఈ యూనివర్సిటీని ఒక బ్రహ్మాండమైన పేరు వహించునటువంటిదిగా చేద్దామనే ఉద్దేశంతోను, ఇది ఆసియాఖండమంతటికికూడ చాలా ఉత్తమమైన కళా పరిషత్తుక్రింద వెలసిల్లుతుందనే ఉద్దేశ్యంతోను దీనికి పునాదులువేయడానికి ఆరంభించాము. అటువంటి ఈ బిల్లుకు శాశనసభ్యులందరు సహాయంచేసి pass చేసినందుకు వారందరికీ మరొకమారు నా అభినందనలు తెలియచేస్తున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao — అధ్యక్షా, నేను మనవి చేసేది ఒకేమాట. ఇంత ఓర్పుతో తీవ్రమైన చర్చలు, బడుదుడుకులు లేకుండా ఒక విశ్వవిద్యాలయాన్ని తిరుపతిలో, శ్రీ వేంకటేశ్వరస్వామి పేరుతో, మనం ప్రారంభించగలిగామన్నది గర్వించదగ్గ విషయము. దీనికి శాసనసభ్యులందరూ సహాయంచేశారు. ఎంతో చక్కగా నిర్వహింపబడినది. కాని ఇకముందు చేయవలసినపని చాలా ఉన్నదని ఇంతటితో మనపని పూర్తికాలేదని ప్రతిపక్షనాయకులు నాగిరెడ్డిగారు సెలవిచ్చారు. కనుక ఇకముందుకూడ అందరు తోడ్పడితే త్వరలోనే విశ్వవిద్యాలయం చక్కగా ఏర్పడగలదని ఆశిస్తున్నాను. ముఖ్యంగా ఈబిల్లు తయారుచేయడంలో మొదటినుంచికూడ శ్రద్ధచూపెట్టి law విషయాలలోనే కాకుండా ఆర్థిక విషయాలలోకూడ నాకు సరియైన సలహాలిచ్చి చేయూతనిచ్చి, సహాయంచేసినటువంటి ఆర్థికమంత్రి విశ్వనాథంగారికి ప్రత్యేకంగా నాధన్యవాదాలు అర్పిస్తున్నాను. ఇంతకంటె ప్రధానంగా ముఖ్యమంత్రిగారు ఈ విషయములో మాకు తగిన సంకల్పము, ధైర్యము ఇచ్చియుండకపోయినట్లయితే, దీనిని ఇంత త్వరగా తీసుకొని రాగలిగి యుండెడివారము కాదు. అందుకు వారికి నా ప్రత్యేకధన్యవాదాలు. ముఖ్యంగా ఈబిల్లును మొదటినుంచి ఎంతో శ్రద్ధతో జాగ్రత్తగా పరిశీలించి, సలహాలు ఇచ్చినటువంటి ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగారు, శ్రీరంగ [illegible] గారికి, Director of Public

Instruction గోవిందరాజులుగారికిని నా ప్రత్యేక ధన్యవాదాలు అర్పిస్తున్నాను. తిరుపతిదేవస్థానం కమీషనరు, అన్నారావుగారు అక్కడి విషయాలను శ్రద్ధగా పరిశీలించి మనకు చేయూత నిచ్చారు. ఆదేవిధముగా దీనికి సంబంధించి నటువంటి సెక్రటరీలు, అసిస్టెంటు సెక్రటరీలు Finance & Law పేరంతాగూడ వారిపనులు వదలిపెట్టి దీనికి చాలా సహాయంచేశారు. తరువాత Legislature Secretary, Deputy Secretary, వీరు పగలు రాత్రంటే ఆరాత్రి ఎప్పుడు పిలిస్తే అప్పుడు సిద్ధంగా వచ్చిహాజర్చాని పనిచేసి సహాయం చేశారు వీరందరికి కూడ నా అభినందనలు అర్పిస్తున్నాను. ఈ బిల్లును ఇంత త్వరగా pass చేసినందుకు అందరికి నా అభినందనలు తెలుపుతూ దీనిని మూడవసారి pass చేయమనికోరుతున్నాను.

Deputy Speaker :— The question is :

That the Sri Venkateswara University Bill , 1954, as amended, be passed into law.

The motion was carried and the Bill passed into Law.

## 2. THE MADRAS GENERAL SALES TAX (ANDHRA AMENDMENT) BILL 1954

Sri K. Govinda Rao — అధ్యక్షా ! Sales Tax Bill agenda లో వున్న ప్రకారము వెంటనే అమలులోకి తీసుకొని రావాలని అంటున్నారుకాని, దీనిలో చాలా Technical difficulties వున్నవి. జమీందారి రద్దు బిల్లుకుకూడా సవరణలువున్నవి. కాబట్టి యీ జమీందారిరద్దుబిల్లును వెంటనే తీసుకొని అది పూర్తిగా చేసినతరువాత యీ Sales Tax బిల్లును తీసుకుంటే మంచిదని నేను suggest చేస్తున్నాను. ఈ suggetion ఆమోదించమని కోరుతున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— Sales Tax Bill లోని అంశములు చాలామట్టుకు సెలెక్టుకమిటీలో ప్యాసుచేశాము. అందులో controversial clauses యేమీలేవు. అందువల్ల సెలెక్టుకమిటీలో ప్యాసు అయినంతవరకు తీసుకొని pass చేయాలని కోరుతున్నాను. మిత్రుడు గోవిందరావుగారు నా యీ suggestion ను అంగీకరిస్తారని ఆశిస్తున్నాను.

Deputy Speaker :— ఈ Sales Tax Bill ను యథాతథంగా తీసుకుంటున్నాను. The Education Minister will now move the Sales Tax Bill.

The Hon. Sri S. B P. Pattabhirama Rao :— Sir, I move :

That the Madras General Sales tax (Andhra Amendment) Bill, 1954 as amended by the Select Committee, be taken into consideration.

[The Hon. Sri S. B. P. Pattabhirama Rao] [1st June 1954

Some of the clauses have been amended by the Select Committee and the rest have been unanimously agreed upon. There was some controversy about clause 8 (b) and that has been deleted and so we are retaining the clauses agreed upon and we have passed them. I request that the Bill as come out from the Select Committee be accepted.

Sri K Krishna Rao — అధ్యక్షా! ఈబిల్లు గురించి ఒక విషయము మాత్రము చెప్పదలచుకొన్నాను. Select Committeeలో మేము ఒక పెద్ద principle మాత్రము అంగీకరించాము. సాధారణముగా ప్రభుత్వము ఏబిల్లును తెచ్చినప్పటికిని మనయొక్క ఆర్థిక పరిస్థితిని అభివృద్ధిపరచడానికి ప్రయత్నించాలి. ఈ taxation measures రైతులుయొక్క produce ను మార్కెటులో పెట్టి అమ్మేటప్పుడే వారికి నష్టం కలిగే విధంగా వుండకూడదని అంటున్నాను. అందరు ఏకగ్రీవముగా అంగీకరించిన బిల్లు యిది. సెలెక్టుకమిటీలో ఏకగ్రీవముగా అంగీకరించిన విషయములో యీ బిల్లులో పొందుపరచడము జరిగింది. ఇతర విషయాలు రాలేదంటే, వాటినిగురించి ఎత్తుకొనలేదని చెప్పాలి Agricultural produce market లో అమ్మదూపినప్పుడు యీ taxation ఏవిధంగా చేయాలి అని ఆలోచించవలసియున్నది. అంతేకాని తొందరపడి యీ బిల్లు pass చేస్తే, రైతు దెబ్బతింటాము. Agricultural produce మీద tax వేసేటప్పుడు రైతుకు ఏవిధంగాను నష్టము రాకుండాచూడాలి. అదివిడిచిపెట్టి మిగిలినవిషయాలు యేవైనావుంటే అవి pas చేయటానికి నాకేమీ అభ్యంతరము లేదు.

Sri Vavilala Gopalakrishnaiah — అధ్యక్షా, సెలెక్టుకమిటీలో ప్యాసు చేసినవిశప్ప మరేవితీసుకోకూడదు. కమిటీలో అంగీకరించినవిధంగా pass చేయటానికి మాకు అభ్యంతరము లేదు. Sales Tax కు సంబంధించినవి అనేకవిషయాలు వస్తున్నవి. దేవాదాయ ధర్మాదాయ బిల్లు విషయములో ఏవిధంగా తీక్ష్ణంగా పరిశీలించి మార్పులుచేశారో అదే విధంగా యీ Sales tax విషయములోకూడా ఒకకమిటీనివేసి ఆకమిటీవారిచేత ఈ బిల్లులోని అన్ని అంశాలు పరిశీలింపచేయవలసియున్నది. అసలు యీ tax వేయవచ్చునాకాదా? వేస్తే ఎవరిమీద వెయ్యాలి, actual గా ఎవరు యీ tax కట్టుతున్నారు, ఎవరు evade చేస్తూ లాభముపొందుతున్నారు అనేవిషయాలు పూర్తిగా పరిశీలించవలసియున్నది. ఇందులో actual గా ఎవరు నష్టపడుతున్నారో గుర్తించాలి. అమ్మినవానిదగ్గర వసూలుచేస్తున్నారు. ఇది అన్యాయము. కొన్నవాడిమీద వేసి వసూలుచేయాలి. ఈ tax వేసేటప్పుడు Single point taxation, double point taxation, multi-point taxation యిన్నివిధాలుగా tax వేసి వసూలుచేయడము జరుగుతున్నది. ఈ tax వేసిన వాడిమీదనే వేసి వసూలు చేయడం జరుగుతున్నది. అందువల్ల యిటువంటి అన్యాయాలు జరుగకుండా, దీనికి వేరే ఒక కమిటీని ప్రత్యేకంగా వేస్తే బాగుంటుందని నా సూచన.

Sri K. Govinda Rao — ఈ బిల్లును ఆమోదించే సందర్భంలో నేను ఒక విషయము చెప్పదలచుకున్నాను. ఇటువంటిబిల్లును pass చేయటానికి ఒక Comprehensive legislation తీసుకొనిరావటము అవసరముగావున్నది. ఈ నాడు అనేక రాష్ట్రాలలో అనేకవిధాలుగా యీ tax వేసి వసూలుచేయడము జరుగుచున్నది. కొన్నిచోట్ల single taxation point వున్నది. కొన్నిచోట్ల Double point taxation వున్నది. Travancore-Cochin లో multi-point taxation జరుగుచున్నది. ఇటువంటి రకరకాలుగా వేసే taxation ప్రజలకు ఏవిధంగా వుపయోగముగావుంటున్నదనేది ఆ comprehensive legislation వచ్చినప్పుడు పరిశీలించవలసియున్నది. ఇందులో ప్రభుత్వము యొక్క ఆదాయము దృష్టిలో పెట్టుకొని చూస్తే, యీ tax వల్ల ప్రభుత్వమునకు ఆదాయము తక్కువగావస్తున్నదని తేలుతున్నది అందుచేత ఒక సమగ్రమైనబిల్లును తీసుకొనిరావలసిన అవసరమున్నది. Single point taxation మాత్రమే పెట్టి, ఎక్కువగా ప్రభుత్వానికి ఆదాయమువచ్చేటట్టు చూడాలి. దేశములో పెద్ద పెద్ద వ్యాపారస్థులు యీ tax నుండి తప్పించుకోడానికి తప్పుడులెక్కలుపెట్టి ప్రభుత్వానికి యివ్వవలసిన tax నే కట్టకుండా evade చేస్తున్నారు. ఈ విధంగా tax evade చేయడమువల్ల, పేదరైతు దెబ్బతినిపోతున్నాడు. కమిషనుఏజంటును అనిచెప్పుకొని, పెద్దపెద్ద వ్యాపారము సాగిస్తున్నారు. ఈ విధమైన tax వేయకపోవడము అన్యాయము. వీరు Agricultural produce గాని మరే యితరసరకులుగాని రైతువద్దకొని, బిల్లు రైతుపేరపెట్టి, sales tax వారిపేరులో పెట్టించి, ఆ రైతువద్ద వసూలుచేస్తూ, తాముమాత్రం tax కట్టకుండా, కమీషను సంపాదించి లాభముపొందుతున్నారు. ఈ విధంగా చేయడమువల్ల, యీ ఏజంట్లను encourage చేయడమే జరుగుచున్నది. ఈవిధంగా వసూలుచేయడమువల్ల, యీ tax లను రైతులు భరించలేక పోతున్నారు. ఇంతేకాకుండా యీ Sales Tax Department లో పనిచేసే ఉద్యోగస్థులు పైనుంచి క్రిందవరకు అవినీతికి పాల్పడడముమూలంగా, చాలామంది పెద్ద వ్యాపారస్థులు పలుకుబడిగలవారు, tax కట్టకుండా evade చేస్తూ ప్రభుత్వాన్ని నష్టపరుస్తున్నారు. ఈ ప్రభుత్వ డిపార్టుమెంటును reorganise చేసి, యీ అవినీతిని నిర్మూలించటానికి తగినచర్యలుతీసుకోవలసియున్నది. ఈ వ్యాపారస్థులు ఒకలక్షరూపాయలకు వ్యాపారముచేస్తే, అందులో 90 వేలవరకు లెక్కలలోకిరాకుండా ప్రభుత్వోద్యోగస్థుల సహాయముతో తప్పుడులెక్కలు చూపిస్తున్నారు. ఈ అవినీతిని curb చేయుటానికి effective steps తీసుకోవాలి. ప్రభుత్వము దీన్ని గమనిస్తారని ఆశిస్తున్నాను. కాబట్టి నేనుచెప్పినవిషయాలను దృష్టిలోపెట్టుకొని సమగ్రంగా యీ విషయాలను అన్నిటిని పరిశీలించటానికి ఒక ప్రత్యేకమైన Taxation Enquiry Committee ఒకటిని వేయాలని అంటున్నాను. అంతవరకు దీన్ని సెలెక్టుకమిటీ ప్యాసుచేసినంతవరకు అంగీకరించాలని అంటున్నాను.

Sri Kolla Venkayya — అధ్యక్షా ! ఇప్పుడు తీసుకువచ్చినబిల్లులో యీ 'Commission Agent' అనేవిషయం Select Committee వారు తీసివేశారు. అది సక్రమంగానేవున్నది కాని, యీ మధ్య turn-over గురించి High Court తీర్పుయిచ్చినమీదట పన్ను వేస్తున్నారు. ఈ turn-over విషయంలో ప్రతివ్యాపారస్థుడు Commission agent గా వున్నటువంటివారు యీ sales tax అనేపేరుతో ప్రభుత్వానికి agents గా పన్ను వసూలుచేయ వీలులేదు. High Court తీర్పు యిచ్చినమాట వాస్తవమే. కాని, అది పన్నులో యిమిడ్చుకొని వసూలుచేయవచ్చునని వారు తీర్పుయిచ్చారు. ఆప్రకారం యెవరుపడితే వారు వసూలుచేయవచ్చు. High Court తీర్పుయిచ్చిందంటే, High Court సూచించినపద్ధతి ప్రకారంగా దానిలోలేను. అంతేకాకుండా, పన్నుమీద పన్ను వేసేపద్ధతి చాలా అన్యాయమైనదని నేను చెబుతున్నాను. అది చాలా absurd గా కనబడుతుంది. ఎవరు ప్రభుత్వానికి పన్ను యిస్తున్నారు అని ఆలోచించాలి. అలాంటప్పుడు ఆ వస్తువుమీద పన్ను విధించేటప్పుడు, దానిని collect చేయడానికి అనుగుణంగా amendment ను యీ బిల్లులో తీసుకువస్తే బాగావుంటుంది. Turn-over మీద sales tax యిమిడివుందనే నిర్వచనంప్రకారం, వ్యాపారస్థులు ఒకే దఫాను ప్రజలమీద పన్ను వేసి, ఎక్కువపన్ను వసూలుచేసే అధికారం, అవకాశం వారికి వుంటుంది. ఈ విధానం ప్రకారము పన్నుమీద పన్ను వసూలుచేసేపద్ధతి దీనిలో ప్రవేశపెట్టి నట్లు అవుతోంది. అందుచేత, ప్రభుత్వము యీ క్లాజుమాత్రం వదలుకోవాలనిచెప్పి, ఆ తరువాత అవసరమైనమార్పులు యీ చట్టంలో తీసుకురావాలి. అందుచేత, ప్రభుత్వం యిప్పుడు దీనికి అంగీకరిస్తారని నేను ఆశిస్తున్నాను. పన్నుమీద పన్ను వేయటం మంచిది కాదు. అది వారిచేతికి ఆయుధం యిచ్చినట్లు అవుతుంది. కాబట్టి, దీనిని శ్రీ విశ్వనాథం గారు అంగీకరించాలని కోరుతున్నాను.

Sri V. Chidanandam :— అధ్యక్షా ! యీ విధమైన Sales Tax Bill తెచ్చేదానికంటె, యిప్పుడు అమలులోవున్న prohibition రద్దుచేసే విధానం అమలుజరుప బోతున్నాం కనుక, అందులోవచ్చే ఆదాయంతో సర్దుబాటుచేసుకోవచ్చు. అందుచేత యీ Sales-tax amendment Bill ను తీసుకరాకుంటె బాగుంటుందని నేను అభిప్రాయ పడుతున్నాను. ప్రభుత్వము యెప్పుడూ ఆదాయం కోల్పోకూడదన్నమాట వాస్తవమే. కాని, వున్న ఆదాయంకంటె యెక్కువ ఆదాయం రాష్ట్రానికి కావాలి గనుక, దానికి ప్రత్యామ్నాయంగా తగుసహాయంచేయాలి.

ఇప్పుడు, చిన్నచిన్న అంగళ్లు పెట్టుకొన్నవాళ్లు licences తీసుకోకుండా, sales-tax చెల్లించుటకు లెక్కలుపెట్టక, వారి అమ్మకంపై sales-tax కట్టకుండా వున్నప్పుడు, ప్రక్కనవున్న పెద్దవ్యాపారస్థులు sales-tax కడుతూంటే, అది వారికి ఒక పెద్దదెబ్బగా వున్నది. కాబట్టి ప్రతివ్యాపారి sales-tax లెక్కలు నిర్బంధంగా maintain చేయాలి.

అతడు చిన్నవ్యాపారి కానివ్వండి, పెద్దవ్యాపారి కానివ్వండి గ్రామంలో వస్తున్నా, పెద్దపట్నంలో వస్తున్నా, అతడు సరిగా లెక్కలు ట్టి, అన్ని లెక్కలు సర్కారు ఫైళ్ళలోకి చేర్చి, అతను sales-tax విధిగా కట్టేటట్లు చేయాలని, అది విధిగా collect చేయాలని నేను సూచిస్తున్నాను.

తరువాత, contractors మీద అమ్మకపుపన్ను విధించాలని చెప్పారు. మన రాష్ట్రంపైన, sales-tax purview లోకి వారు రావాలని అంటున్నారు. కాని, గవర్నమెంటువారిపై పన్ను విధించకుండా exempt చేసేటట్లు తీర్మానించి, ఎందుకంటే వారు యేమీ కొని అమ్మటంలేదు కాబట్టి, వారికి exemption యివ్వాలని నేను సలహాయిస్తున్నాను.

Sri Pillalamarri Venkateswarlu :— ఈ Bill ను Select Committee లో రెండు sittings లో కూర్చుని ఆలోచించాలి. దీనిలో Commission Agents విషయంలో, Select Committee లో యేకగ్రీవమైన అభిప్రాయము లేకపోవటంవల్ల, Government ఆ విషయాన్ని వదలివేసింది. ఇప్పుడు ప్రస్తుతమువున్న Sections లో చాలావరకు అభిప్రాయ బేధాలు లేకుండావున్నవి. అయితే, అసలు యీ taxation యెలావుండాలి అనేదానిమీద అందరికీ ఒకే అభిప్రాయమువుండదని అనుకొంటున్నాను. అసలు యీ taxation, Multi-point taxation కాకుండా, single-point taxation గా వుండాలని అనుకొంటున్నాను. బహుశః ఆర్థికమంత్రి శ్రీ విశ్వనాథంగారుకూడా అదే అభిప్రాయంతోవున్నారనే అనుకొంటున్నాను. ఎందుకంటే, వారు తమ Budget speech లో ఆవిధంగానే సూచించారు. అసలు taxation యేవిధంగా వుండాలనేది గవర్నమెంటు యేర్పాటుచేయలేకపోయింది. అందుచేత, యీ చిన్న చిన్న amendments ను తీసుకురావలసివచ్చింది. Sales-tax ముఖ్యంగా purchasers మీదనే పడుతున్నదనేవిషయం అందరికీ తెలుసు. శ్రీ చిదానందంగారు prohibition ను రద్దుచేయాలని, అందువల్ల అదనంగా 5½ కోట్లరూపాయలు ఆదాయంవస్తుందనేవిషయం చెప్పారు. ఇప్పుడు prohibition అమలుజరుపుటకయ్యేఖర్చు ఒకకోటిరూపాయలు అవుతోంది. కాబట్టి, prohibition ను రద్దుచేస్తే వచ్చేటటువంటి ఆదాయం అభివృద్ధి ప్రణాళికలకు వుపయోగపడుతుంది. అందుచేత, యీ విషయం serious గా consider చేయాలని ప్రభుత్వానికి నేను విజ్ఞప్తిచేస్తున్నాను. ఇంతేకాకుండా ఒకవిషయం శ్రీ విశ్వనాథంగారిదృష్టికి తీసుకురావలసివుంది. Tobacco taxation వల్ల కేంద్ర ప్రభుత్వానికి రు. 15 కోట్లు మొదలుకొని రు. 20 కోట్లువరకు మనరాష్ట్రమునుండి ఆదాయం వస్తున్నది. కేంద్రప్రభుత్వము మనరాష్ట్రప్రభుత్వముకోసము కొన్నికోట్లరూపాయలు ఖర్చు పెడుతున్నమాట వాస్తవముకాదు అనేవిషయం అందరికీ తెలుసు. 20 కోట్లరూపాయలు కేంద్రప్రభుత్వము తీసుకుపోతున్నపుడు, మనకు వారుయిచ్చే 80 లక్షలరూపాయలు చాలా తక్కువ. ఇదేరకంగా Bengal ప్రభుత్వంనుండి jute పరిశ్రమపైవచ్చే ఆదాయం కేంద్ర

[Sri Pillalamarri Venkateswarlu] [1st June 1954

ప్రభుత్వము తీసుకుపోతున్నప్పుడు, బెంగాల్ వారి పట్టుదలవల్ల, fairly good amount వారికి యివ్వటం జరిగింది. మన ప్రభుత్వముకూడా అదేవిధంగా కేంద్ర ప్రభుత్వముపై వొత్తిడి తీసుకువచ్చిన, మనరాష్ట్రమునుండి పొగాకువల్ల వచ్చే 20 కోట్లరూపాయల ఆదాయములోనూ, కనీసము 50% అంటే 10 కోట్లరూపాయలను మనకు వారు యివ్వటం న్యాయంగా వుంటుంది. అందుచేత, కేంద్ర ప్రభుత్వముమీద మనరాష్ట్ర ప్రభుత్వము వొత్తిడితీసుకువచ్చి పొగాకుమీదవచ్చే ఆదాయముతో 50% తీసుకొంటేనేగాని, లేకపోతే యిక్కడ ప్రజలమీద యీ పన్నుభారం హెచ్చుఅవుతుంది. Law of diminishing returns వల్ల tariff యింతవరకువచ్చింది. ఇంకా యెక్కువపన్నులు వేసినందువల్ల ఆదాయం పెరుగుతుందనే అభిప్రాయం చాలా పొరపాటైనది. అందువల్లనే prohibition రద్దుచేయాలని అంటున్నాను. నేను సూచించిన ప్రకారంగా కేంద్ర ప్రభుత్వము కనీసము రు. 15 కోట్లు యివ్వవలసిన అవసరంవుంది

మరొకవిషయం, sales tax చెల్లించకుండా evado చేయటం అవుతోందని శ్రీ కె. గోవిందరావుగారు చెప్పారు. Sales tax సక్రమంగా correct చేసి, ఈ రెండుకోట్లరూపాయలు ఎట్లాగో రాబట్టుకోవటం మంచిది. ఈ విషయం ప్రభుత్వం జాగ్రత్తగా serious గా ఆలోచించాలి. అందువల్ల, యీ clause లో వున్నవిధంగా మనం taxation పద్ధతి మార్చుకొనడానికి యింతవరకూ ప్రభుత్వం ప్రయత్నంచేయాలి. కేంద్ర ప్రభుత్వంమీద యీ ప్రభుత్వం వొత్తిడితీసుకువచ్చి, మనకు రావలసినడబ్బు రాబట్టుకోవాలని ప్రభుత్వమునకు విజ్ఞప్తిచేస్తూ, యీ Bill ను consideration లోకి తీసుకోవాలని చెబుతున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— అధ్యక్షా! యిప్పుడు గౌరవసభ్యులు ఆరుగురు యీ బిల్లుమీద చర్చచేశారు. వారు సమగ్రమైన విషయాలను కొన్నిటిని చెప్పారు. వారికి సలహాలను నేను వినయవిధేయతతో అంగీకరిస్తూ, వారికి నా అభినందనలు అర్పిస్తున్నాను.

అయితే శ్రీ వావిలాలగోపాలకృష్ణయ్యగారు మాట్లాడుతూ యీ Sales-tax (Andhra Amendment) Bill ను సమగ్రంగా ఆలోచించుటకు ఒక కమిటీని వేయాలని సూచించారు. కాని యింతలోనే, Taxation Enquiry Committee ఒకటి వస్తున్నది. వారి report వచ్చినతరువాత, యీ విషయాలు ఆలోచించవచ్చు. కాని, యీలోపలే మనం ఒక కమిటీనివేసినా, కేంద్ర ప్రభుత్వమువారు యివన్ని యెట్లాగూ ఆలోచిస్తారు. ఇటువంటి problems అన్నిటినీకూడా యీ Commission కు వారు వప్పజెప్పారు. వారి report వచ్చినతరువాతనే యివన్ని చూడాలికాని, లేనియెడల యిప్పుడు [illegible] కమిటీని వేస్తే confusion వస్తుంది.

నా ఉద్దేశం వేరు composite మద్రాసులో ఉన్నప్పుడు చెప్పాను. ఆ merchants ను కొందరినిపిలిచి వాళ్లయొక్క అభిప్రాయాలనుతీసుకొని చేయాలని అనుకొన్నాను. ఇంతలో మనరాష్ట్రం విడిపోవడం జరిగింది. తరవాతకూడా మన merchants ను పిలిచి వాళ్లతోటి చర్చించాం. ఇప్పుడు శ్రీ గోవిందరావుగారు చెప్పినవి కూడా మనం చర్చించవలసిఉంది. ఈలోపున మనకు Taxation Enquiry Committee report కూడా వస్తుంది. సమగ్రంగా sales tax లో ఉన్నటువంటి defects అన్నీ rectify చేయడానికి ఆలోచిస్తాం. అయితే single point tax కు change చేయమని చెప్పారు ఈ evasion అయిన tax లు అన్నీకూడా ప్రభుత్వానికి చెల్లించవలసి ఉంటుందని, దీనివల్ల ఇబ్బంది కలుగుతోందనికూడా merchants కు చెప్పాను. గతసంవత్సరంలో శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణజిల్లాలలోని కొంతమంది వ్యాపారస్థులు అమ్మకం కొనుగోలు పుస్తకములలో చూపించకుండా ఉంచిన రు, 1,04,24,428 ల లెక్కలను మన ఉద్యోగస్థులు పట్టుకొన్నారు ఇది 1953-54 లో జరిగినసంగతి ఈ పద్ధతిలో జరుగుతోన్నప్పుడు మీరు single point tax వేయమనిచెప్తే చాలా కష్టంగా ఉంటుంది ఇన్ని సందర్భములలో పన్ను వేస్తున్న ఎగవేయడం జరుగుతున్నపుడు ఒక single point tax అంటే ఎంతో నష్టంవస్తుంది. అందుచేత Taxation Enquiry Committee వారి report వచ్చినతరవాత కొన్ని మార్పులు తీసుకురావడానికి ప్రయత్నిస్తాం. కాని, వెంటనే ఇప్పుడే చేయాలంటె అసలు taxation విధానం లోని structure తబ్బిబ్బైపోతుందని చెప్తున్నాను. అంతకంటె నేను మనవిచేసేదేమీ లేదు. ఈ విషయాలన్నీ select committee stage లో చర్చించాం. శాసనసభవారు అన్ని విషయాలను పరిశీలించిబిల్లును ఆమోదించాలని కోరుతున్నాను.

Deputy Speaker :— The question is :

That the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1954 (L. A. Bill No. 18 of 1954) as amended by the Select Committee be taken into consideration.

The motion was carried,

## CLAUSE 2

Sri K. Venkayya :— ఈ clause మాత్రం ప్రభుత్వం వెంటనే pass చేయాలని కోరడం ధర్మంకాదు. ఇది చాలా నష్టకరమైనదని ప్రభుత్వదృష్టికి తీసుకు రావలసిన అవసరం ఉంది. High Court తీర్పు ఇచ్చిందని వ్యాపారస్థులమీద హెచ్చు పన్ను విధించడం సబబు కాదు. ఇంత వసూలుచేస్తామనేది చెప్పకుండా వాళ్లూ కొనుగోలుదారులనుంచి డబ్బు వసూలుచేయడం జరుగుతుంది. అసలు tax మీద tax వేయడంఅనేది తప్పుడుపద్ధతినే ప్రవేశపెట్టినట్లు అవుతుంది. అందుచేత ఇది సరైన విషయంకాదని చెప్తున్నాను.

The Hon Sri T. Viswanatham — ఇందులో అక్రమం ఏమీలేదు. Turn over అనేది మామూలు term. ఇంత ఖరీదుకు నేను ఈ సరకు అమ్మ తలుచుకున్నాననే నిశ్చయానికి రావడానికి అనేకవిషయాలు చూచుకోవలసి ఉంటాయి అందులో మునిసిపల్ టాక్సుకూడా ఉంటుంది, కస్టమ్స డ్యూటీకూడా ఉంటుంది, ఇంకా ఇతరఖర్చులుకూడా ఉంటాయి. అందులో లాభంకూడా ఆలోచించుకోవలసి ఉంటుంది. Railway charges కూడా ఉంటాయి. అందుచేత sales tax ఇంత అని వివరంగా ఉండదు. ఇవన్నీ చూచుకొని అమ్ముకుంటాడు. ఇంతవరకు ఉన్నదానిమీద High Court వారు అడ్డుచెప్పారు. మన Taxation Enquiry Committee వారి report వస్తుంది. ఈలోపున సమగ్రంగా దీన్నంతా పరిశీలించి నూతనమైన శాసనం తీసుకువస్తామని సెలెక్టుకమిటీ stage లో కూడా చెప్పారు. ఇందులో కేవలం అక్రమమేమీ చేయ దలచుకోలేదు. అనుమానముంటే అడగవచ్చు. దాన్నిగురించి ఒక శాసనం తీసుకువస్తాం. అప్పుడు ఇవన్నీ ఆలోచించడానికి వీలుగా ఉంటుంది. ఇప్పుడుమట్టుకు శ్రీ వెంకయ్యగారు తమ ఆక్షేపణను ఉపసంహరించుకొంటారని అనుకుంటున్నాను.

Sri K. Krishna Rao — సరిగా explain చేయమని కోరుతున్నాను. అవి అందరికీ తెలియాలికదా ?

Sri Vavilala Gopalakrishnaiah — దానిలో any other sums charged by the dealer అని ఉంది. బిల్లుమీద కొన్నవస్తువు వ్రాస్తాడు, ఖరీదు వ్రాస్తాడు, sales tax వ్రాస్తాడు. దానిమీద ఇంకొకపన్ను విధిస్తారా ?

Sri K. Venkayya :— మీరు పన్నుమీద పన్ను వసూలుచేస్తున్నారు. ఇప్పుడు శ్రీ విశ్వనాథంగారు ఈ పన్ను అనేది వస్తువు ఖరీదుతోటి కలిపి దానిమీదపన్ను తీసుకుంటా రని చెపుతున్నారు. అసలు వస్తువుమీద పన్నా లేక పన్నుమీద పన్నా అనేది వివరించాలి. వస్తువు అమ్మకంమీద కాకుండా పన్నుమీద పన్ను వేసేపద్ధతి ఇక్కడ ప్రవేశపెట్టారు ఈ బిల్లులో ఎంత పన్నును వేస్తారో చెప్పకుండా ఎంతపడితే అంత వసూలుచేయడానికి అవ కాశం ఏర్పడుతుందనేది మరో ముఖ్యవిషయం.

The Hon. Sri T. Viswanatham :—

Judgement of the High Court :

Once it is held that the total amount which the purchaser pays is the sale price under the Act, it is quite clear the dealers cannot deduct from the aggregate of the amounts received the amount representing the sale tax payable. The dealers must include all that they have received as consideration for the sales in computing the actual gross turnover.

ఏ వర్తకుడైనా ఈ విధంగా చేస్తూంటాడు ఏదైనా వస్తువు అమ్మితే దానిమీద sales tax అనేది వస్తువుయొక్క అమ్మకం ధరపైన వేసేటటువంటి పన్ను. ఈ అమ్మకం పన్నులు అన్నివిధాలుగానూ వసూలుచేయబడుతాయి. ఒకవస్తువు ఉంటే దానిని అమ్మేటపుడు దానిధరలో sales tax, అన్నివిధములైన పన్నులు, దానికైన charges అన్నీ ఇమిడి ఉంటాయి. పన్నుమీద పన్ను వేయడంకాని, ఇంతో అంతో మోసం ఉంటుందని చెప్పచ్చు. ఒకవస్తువు చిల్లరధరమై అమ్ముతూంటే, దానిని sales tax మీద మళ్లీ sales tax వేయకూడదు అని అనము. కొన్నివస్తువుల 90 రూపాయలు ధరగలవి ఒక వర్తకునివద్ద నున్నాయంటే, వాటి అమ్మకం ధరపై అమ్మకపుపన్ను దాదాపు 1-8-0 రూపాయలు అవుతుంది. అతనికి మొట్టమొదట అయిన ఖర్చులు, ఇవ taxes, ఇవు దతడు దానిని అమ్మేటపుడు వసూలుచేయవలసిన అమ్మకం పన్ను 1-8-0 రూపాయలుకలిపి 3-0-0 రూపాయలు అవుతుంది. అంటే అతను వాటిని అమ్మవలసినవి లాభంలేకుండానే 93-0-0 రూపాయలకు, అప్పటికీ అవి 90 రూపాయలకుకూడా ఖర్చుకాకపోతే 89 రూపాయలకే ఆ సరకులను అమ్మాలి. అటువంటపుడు అతనికి sales-tax collections కే వీలుండదు. sales-tax కూడా వసూలుకాదు. అప్పుడైనాగాని అవి అమ్ముడుకాకపోయినా, 87 రూపాయలకే అమ్మవలసివస్తుంది. బహుశః ఆ వస్తువులు అప్పటికీ అమ్ముడుకాకపోతే ఇంకా తక్కువకో అమ్మినట్లయితే అతనికి నష్టం వస్తుంది అపు డతనికి turn over 87 రూపాయలేనని చెప్తాడు. అలాంటపుడు వస్తువు దాని అసలుధరకన్న చాలా తక్కువకు అమ్మబడుతుంది. ఆ పరిస్థితిలో ఆ తక్కువ ధరయైన 87 రూపాయలలోనుంచి ఆ పన్నును అతడు ఎలా చెల్లించగలడు? ఈ విధంగా అయితే చాలా నష్టంవస్తుంది. అందువల్ల ఆ 87 రూపాయలపైన, అనగా అతడు ఆవస్తువును అమ్మినధరపై వేరుగా అమ్మకపుధరను వసూలు చేస్తారు. ఈ విధంగా ఈ sales-tax ను వసూలుచేయడం జరుగుతోంది. Dealers ఈ విధంగా sales-tax ను వసూలుచేస్తారు. Dealers ఇన్ని significances ఎలా వ్రాస్తారు? అందుచేత ఈ items ను ఇంతకు అమ్మితే, మొత్తంమీద పన్ను ఇంత అవుతుంది అని నిర్ణయించి ఆ పన్నును వేస్తారు. దీనిని మీరు అధర్మం అని మనవిచేస్తున్నారు. వారు కనుక ఈ విధంగా వసూలుచేయకపోతే వాళ్లకు turn over మాత్రంవుండదు. అసలు turn over కూడ పెట్టకపోతే, అసలు వర్తకం సంగతి, అసలు కథనడవదు. ఈ taxation ఈ విధంగా వేయకపోతే మధ్య వాళ్లకే నష్టంకల్గుతుంది. వాళ్లకు సహాయంచేయడానికి ఈ taxation ను వసూలుచేయడంలేదు. అసలు taxation ను వసూలుచేయడంవరకు మాత్రం ధర్మసూత్రమని ఒప్పుకుంటే ఇది బ్రహ్మాండమైన ధర్మమని నేను మనవిచేస్తున్నాను.

Sri K. Krishna Rao :— ఇష్టంవచ్చినట్లుగా sales tax పేరుతో వస్తువులయొక్క ధరలు పెంచడానికి అవకాశంఉందని వెంకయ్యగారు తెలవిచ్చారు. ఈ ధరలు పెరగడమనేది అసలు ఆ వస్తువుల supply మీద ఆధారపడి ఉంటుంది.

ఈ వస్తువులపైన అసలు, customs పన్ను ఎక్కువగా వసూలుచేయబడుతుంది. ఆ వస్తువు యొక్క అసలు priceన ఇంకా ఈ customs పన్ను, తరువాత Sales tax మొదలైనవి చేరుస్తున్నారు. ఆవిధంగా చేర్చినమూలాన ఆ వస్తువులధర పెరుగుతున్నది. ఈవేళ ఈ వస్తువుపై market లో customs పన్ను ఒకరూపాయి ఉంటే, రేపు 4 రూపాయల వరకు పెరిగే అవకాశం ఉంది. ఇదంతా ఆ వస్తువుయొక్క demandపైన, ఆ వస్తువు యొక్క supply బట్టి పెరుగుతుంది ఈ వస్తువులధర పెరగడమనేది ఈ customs taxation మీద ఆధారపడి ఉంటుంది. అంతేకాని వాళ్ళ యిష్టంవచ్చినట్లు, ఈ వస్తువుల ధరలను పెంచడం, అమ్మడం జరగదు. ఈ taxation మీద tax వేయడమనేది, customs పైన, ఆ వస్తువుల supply పైన ఆధారపడి ఉంటుంది ఈ tax మీద tax వేయకుండా ఉండడానికిగాను ప్రయత్నించాము. కాని అది అంతసులభంగా చేయడానికి వీలులేకపోయింది. ఈరోజున ఏదైన ఒకవస్తువుకు బజారులో 20 రూపాయల ధరఉండి, వెంటనే రేపు 21 రూపాయలైనదంటే, సాధారణంగా ఇదివరకు ఆ వస్తువుల stock ఉన్న వారుకూడా 21 రూపాయలకు వాటిని అమ్మడం, ఆధరపైననే sales tax వసూలుచేయడం జరుగుతోంది. ఆ విధంగా కాకుండా ఆ పెరిగిన ఒకరూపాయిమీద sales tax వసూలు చేయకుండా ఉండడానికి మేము ప్రయత్నించాము, కాని దీనివల్ల, వర్తకులకు ఎక్కువగా యిబ్బందికల్గుతుంది. ఒకవేళకనుక బజారులో ఆవస్తువులధర ఒకరూపాయ తగ్గితే వారు 19 రూపాయులమీద sales tax వసూలుచేయవలసి వస్తుంది. అపుడు వారికి చాలానష్టం వస్తుంది. వర్తకులకు చాలా యిబ్బంది కల్గుతోంది. కాని వారుమాత్రం ధరలు ఇష్టంవచ్చినట్లు పెంచకుండా ఉండేందుకు, పెంచడానికి అవకాశంలేకుండా ఉండడానికీగాను మేము అంగీకరించాము. దీనినిగురించి మేముకూడా చాలా ఆలోచించాము. దీనిగురించి అంత సీరియస్‌గా discuss చేసిన తరువాతకూడా ఏమి చేయడానికి వీలులేకపోయినది. అందువల్ల Select Committee లో దీనివిషయమై మా బాధ్యత ఉందని నేను మనవిచేస్తున్నాను. అందువల్ల దీనిని ఆమోదించవలసినదని వెంకయ్య గారిని కోరుతున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao — అధ్యక్షా! దీనికంతకూ బాధ్యత కృష్ణారావుగారే. ఇంతకంటే వారేమీ చెప్పలేదు. చెప్పవలసిందేదో చెప్పారు. ఈ క్లాజును ఆమోదించవలసినదని వెంకయ్యగారిని కోరుతున్నాను.

Clause 2 was put and carried.

Clauses 3 and 4 were put and carried.

## CLAUSE 5

**Sri D. Seetharamaiah :—Sir, I beg to move: In sub-clause (a) for the words 'within thirty days' substitute the words 'within 45 days.'**

ఈ సవరణను నేను ఎందుకుయిచ్చానంటే Commercial Taxes Officer చిల్లర సరకులు అమ్ముకునే చిల్లరవ్యాపారస్థులవద్దనుంచి, పన్నులు వసూలుచేసేసందర్భంలో వారికి appeal కు 30 రోజులు time limit యిచ్చారు. ఆ చిల్లరవ్యాపారస్థులు అక్కడక్కడ తిరుగుతూ వ్యాపారంచేసుకుంటారు. అందుచేత వారికి communications అందడం చాలా ఆలస్యమైన వారు తిరిగి appeal చేయడానికి 30 రోజులకాలం చాలక బాధపడుతున్నారు. అధమపక్షం 45 రోజులైనాసరే వారికి time ఉండాలి అని నేను మనవిచేస్తున్నాను. అందుచేత ఈ సవరణను ప్రతిపాదించాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao—అధ్యక్షా! ఈ విషయం గురించి Select Committee stage లోనే మేము ఆలోచించాము. Survive అయిన తరువాత 45 రోజులంటే చాలా ఆలస్యం అవుతుంది. 30 రోజులైతేనే సౌకర్యంగా ఉంటుంది. 45 రోజులైతే అసలు ఆ విషయమే మర్చిపోవడమో ఏమో జరుగుతుంది. అందుచేత ఉభయత్రాకూడా నష్టంవస్తుంది. అందువల్లనే 30 రోజులు time అని అందులో ఉంచేశాము. అందువల్ల మీరు 30 రోజుల time కి ఒప్పుకొని, మీ సవరణను withdraw చేసుకోవాలని కోరుతున్నాను.

Sri D. Seetharamaiah — నేను నా సవరణను withdraw చేసుకుంటున్నాను.

(Sri D. Seerharamaiah withdrew his amendment.)

Clause 5 was put and carried.

Clause 6 was put and carried.

## CLAUSE 7

Sri D. Seetharamaiah:—Sir, I beg to move:

In the proposed sub-section (1) (ii) of Section 12A of the principal Act, for the words "was communicated to him" substitute the words 'was served on him.'

The amendment was duly seconded.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao:— ఈ విధంగా వేయడానికి మేము ఒప్పుకున్నాము, అప్పుడు కృష్ణారావుగారున్నారు. మీరుకూడా Select Committee లో చెప్పారు. దానికి మేము అంగీకరించాము. అలాగ ఉంటే బాగుంటుంది. ఇది మొట్టమొదటే వేసి ఉండవలసింది, ఏదో పొరపాటున చేర్చడం జరగలేదు. ఈ సవరణను అంగీకరించుచున్నాను.

The amendment was put and carried.

Sri D. Seetharamaiah — clause 7 sub-section 5 (ii) క్రింద సవరణ ప్రతిపాదిస్తున్నాను. For the words 'without interest' substitute the words 'with interest at two per cent per annum'

ఈ సవరణను ఎందుకు ప్రతిపాదిస్తున్నానంటే సాధారణంగా Commercial Taxes Officers చిల్లర వ్యాపారస్థులపైన కేసులు పెట్టి త్రిప్పడం జరుగుతున్నది. ఈవిధమైన కేసులు పెట్టగా వచ్చిన నష్టం కోటి, ఇరవై వేల రూపాయలు అని తెలుస్తోంది. అటువంటివి జరుగకుండా interest పెట్టామంటే Officers జాగ్రత్తగా వుండడానికి ప్రభుత్వం అజమాయిషీ చేయడానికి అవకాశం వుంటుంది. అందువల్ల interest at the rate of 2 per cent per annum అని సవరణ ప్రతిపాదిస్తున్నాను.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao — అధ్యక్షా, ఇందువల్ల ప్రభుత్వానికి చాలానష్టంవస్తుంది. ఇది అనవసరం. మధ్య పెట్టబడిన కోటీ నాలుగులక్షలరూపాయలు వసూలుచేసినా interest రాదు మధ్యపడిన సొమ్ముమీద interest రానప్పుడు ప్రభుత్వం దగ్గఱనుండి interest వసూలుచేసి నష్టపడమనటం సరయిన పనికాదు. ఆలస్యం జరిగినకేసులు నాదృష్టికి తెస్తే విచారణచేస్తాను. ఇదివరకు delays చేయవద్దని ఆర్డర్సు యిచ్చాను. ఈ amendment withdraw చేసుకోవలసినదని కోరుతున్నాను

Sri D. Seetharamaiah —మంత్రిగారు హామీ యిస్తున్నారు కనుక నా సవరణను ఉపసంహరిస్తున్నాను.

Clause 7 as amended was put and carried.

Clauses 8 to 13 were put and carried.

Clause 1 and the Preamble were also put and carried.

The Hon. Sri S. B. P. Pattabhirama Rao :— Sir, I beg to move: "That the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1954 (L. A. Bill No. 38 of 1954) as amended be passed into law."

Sri Vavilala Gopalakrishnaiah :— అధ్యక్షా, evasive cases పట్టాం అన్నారు. [illegible] పట్టుకోవాలని ప్రభుత్వాన్ని [illegible] చేశాను. అయితే వారు యిప్పుడు Finance Minister గా వున్నారు. పట్టడానికి చాలా [illegible] వస్తున్నారు.

1st June 1954]

The Hon. Sri S B. P. Pattabhirama Rao :— గౌరవసభ్యులు సహకరిస్తే తప్పకుండా పట్టుకుంటాం. మాదృష్టికితెస్తే మా ఉద్యోగస్థులు పట్టుకుంటారని మనవి చేస్తున్నాను.

Sri Vavilala Gopalakrishnaiah — మేముకూడా కొన్ని పట్టిస్తాం.

Deputy Speaker :— The question is:

That the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1954, (L. A. Bill No. 18 of 1954) as amended be passed into law.

The motion was carried and the Bill was passed into law.

Deputy Speaker :— నేటి సభా కార్యక్రమం పూర్తి అయినది. నిరవధికంగా సభను వాయిదా వేస్తున్నాను.

---

Sree Rama Press, Madras-21.
8-9-1955.